# భగ్నజీవులు

(కథలసంపుటి)

—: రచన :—

నాయిని దామోదరరెడ్డి

కొత్తపల్లి (తాలూకా దేవరకొండ)

# ఆశీస్సులు

శ్రీయుత యస్. దామోదర రెడ్డిగారు నాకు చిరపరిచితులు. వీరు రచించిన "భగ్న జీవుల"ను గ్రంధరాజమును స్థాలీపులాక న్యాయముగగాక మిగుల శ్రద్ధతో సాంగోపాంగముగ పఠించి మిగుల సంతసించితిని.

వీరి రచన గ్రామ్యపద భూయిష్టమైనను పఠితలకు మెప్పుగొల్పు చుండును.

భగవానుడు వీరికృతిని ఆశీర్వదించు గాక!

స॥ అజ్మతుల్లా కవి
దేవరకొండ

ఈ "భగ్న జీవుల"లోని కథలు నాకు కొంత తాత్కాలానందమును చేకూర్చినవి. శ్రీయుత యస్. దామోదర రెడ్డి ఆంధ్ర సారస్వతములో నభిమానము చూపుచున్నందులకు మెంతయు సంతసింపదగియున్నది. ఆధునిక కథా సాహిత్యము ననుకూలించు భావనను నుపయోగించి, పామరజన రంజకముగా గూర్చబడినది. తాత్కాలిక మనస్సంచలనము గలిగించి పఠితలను ద్విగ్నులను చేయుగల కథాసాహిత్య మిప్పుడెంతేని యవసరము. ఈతనికృషి సాఫల్యతనొందుటకు సందేహము లేదు. ప్రథమ ప్రయత్నము గావున మున్ముందు పండితామోదము, ఉత్సాహము, వృద్ధినొంది "ఆదర్శ కథారచయితగ" నగునని విశ్వసించుచున్నాను. ఇట్లు

ఎస్. శఠగోపాచార్య విద్వాన్ విశారద
గా॥ హైస్కూల్ ఆంధ్రోపాధ్యాయుడు. దేవరకొండ

# పరిచయము

అన్ని సాహితీ ప్రక్రియలకంటే నేడు లేపు కథకు బహుళమైన ప్రచారము కలుగుచున్నది. ప్రాచీన కాలం నుంచి కథలంటే ప్రజలకు ప్రీతిఎక్కువ. వేదాంత విషయాలు కూడా కథారూపంలో చెప్పేపద్ధతి ఉంది.

ఇప్పుడు రచయితలలో పలువురు కథకులే. ఈకథకుల ప్రతిభను ప్రయోజనాత్మకంగా రూపొందించే మార్గదర్శనం మన దేశంలో లేదనే చెప్పవచ్చును. కథల్లో సంగ్రహత, శిల్పమూ, సహజత్వమూ ఉండాలె సృజనాత్మకమైన కృషితో పాటు దేశంలో విమర్శనముకూడ పెరగాలె. అప్పుడే ప్రక్రియకైనా విలువ హెచ్చుతుంది.

శ్రీయుత యస్. దామోదర రెడ్డిగారు యువకులు, కథకులుగా పఠితలోకానికి పరిచితులు కావడానికుత్సహిస్తున్నారు. వీరి కథలలో సృష్టించిన వాతావరణం, సన్నివేశాలు సహజంగా ఉన్నాయి. రచనలో వైశిష్ట్యాన్ని సంపాదించడానికి ఉత్తరత్రా ఇంకా కృషిచేస్తే మంచిది. ఇదఅతని తొలికాదు. అన్ని విధాల ప్రోత్సహిస్తే ఉత్తమ కథకుడుగా రూపొందగలడు. ప్రతిభకు లోటులేదు. పఠితులు దీన్ని హృదయపూర్వకంగా స్వీకరిస్తారని నమ్ముతున్నాను.

ఇరివెంటి కృష్ణమూర్తి. ఎమ్. ఏ.

హైదరాబాద్ — నిజాం కళాశాల

తేది 6-2-1957 — ఆంధ్రోపన్యాసకుడు

# అంకితము

తే॥ పరమ ధార్మికుడని కీర్తిఁ బడసి జగతి
విడి స్వర్లోకమున కేగి నాడ వీవు
కృతినిగొనినన్ను దీవించు హితమొలర్ప
రేబవళ్ళను గుగనాధరెడ్డి, తండ్రి.



# ముద్రణా సహాయకులు



**శ్రీ శీలం అల్వాల్‌రెడ్డి గారు** పాలెపల్లి శ్రీ దూదిపాల పుల్లారెడ్డి గారు–చింతకుంట్ల, శ్రీతుమ్మలపల్లి నారాయణరెడ్డిగారు–పేర్వాల, శ్రీ తుమ్మల పల్లి వీరారెడ్డిగారు–పగిడిపల్లి, శ్రీ తుమ్మలపల్లి పుల్లారెడ్డిగారు–పగిడిపల్లి, శ్రీ తుమ్మలపల్లి వెంకట్రాంరెడ్డిగారు-కొట్టాల, శ్రీ తుమ్మలపల్లి మాణిక్యారెడ్డి గారు-పేర్వాల, శ్రీ దూదిపాల చంద్రారెడ్డిగారు-చింతకుంట్ల, శ్రీ పునరెడ్డి నారాయణరెడ్డిగారు-నవర్లపల్లి, శ్రీ కుంభం వీరారెడ్డిగారు-కుంకిశాల, శ్రీ గడ్డంపెల్లి నారాయణరెడ్డిగారు-దేవరకొండ, శ్రీ నాయిని రంగారెడ్డిగారు–కొత్తపల్లి, శ్రీ నాయిని రాంరెడ్డిగారు–కొత్తపల్లి, శ్రీ కాలం నర్సింహరెడ్డిగారు–నవర్లపల్లి శ్రీ కోతి శీతరాంరెడ్డిగారు-పెదమునిగల్, శ్రీతుమ్మలపల్లి కాశిరెడ్డిగారు–పేర్వాల శ్రీ మల్లాపురం రంగారెడ్డిగారు శ్రీ తుమ్మలపల్లి రాంచంద్రారెడ్డిగారు-పేర్వాల, శ్రీ కాకులవరం రంగారెడ్డిగారు-కొత్తపల్లి, శ్రీ తుమ్మలపల్లి రంగారెడ్డి గారు–పగిడిపల్లి, శ్రీతుమ్మలపల్లి రంగారెడ్డిగారు–పేర్వాల, శ్రీతేలుకుంట్ల లింగారెడ్డిగారు-ముష్టిపల్లి, శ్రీ మైనముపాటి అనంతరెడ్డిగారు–చన్నంపల్లి, శ్రీతిప్పర్తి నారాయణరెడ్డిగారు-తెనుగుపల్లి, శ్రీతిప్పర్తి పుల్లారెడ్డిగారు–తెనుగుపల్లి, శ్రీమల్లారెడ్డిగారు–చన్నంపల్లి.

పైవారు నా ఈ గ్రంథ మచ్చొత్తించుటకు ఉదారబుద్ధితో అడిగిన క్షణమే తమ శక్తి కొలది ఆర్థికసహాయమొనరించి నందులకు నా అత్యంత కృతజ్ఞతాభివందనము లర్పించు చున్నాను.

ఇట్లు,
రచయిత

ఇందులో............

భగ్న జీవులు
తప్పు ఎవరిది?
కలసిరాని వేళ
మోసపోయిన బ్రతుకులు

( ఇందలి కథలు కేవలం కల్పితములు )

# నా మాట...

ఆంధ్రావతరణముతోపాటు, చిరకాల స్వప్నములు నెరవేరినవి. అందున్న మాతృ మిగుల సంతసించింది. కవితామతల్లి ప్రగాఢవాంఛ నెరవేరపోతున్నది. మనల నావరించిన గాఢతమఃపటలము చెదరిపోయి కళావికాసానికి, సంస్కృతికి తిరిగి ప్రోత్సాహము లభించినది. ఆంధ్రభాషను నూతనాలంకారములతో శోభింపచేయుటకు ఇదొక మంచి శుభసమయము. ఇది శుభోదయానికి అభ్యుదయ చిహ్నము ఆంధ్రావతరణమే!

ఆంధ్రులంతా ఒక్క త్రాటిపైన నడచి, ఐక్యమత్యముతో నిరుస్తున్న ఈ రోజులలో భౌతిక పరిస్థితుల ప్రగాఢ ప్రభావానికిలోనై కవితా కౌగిటిలో హాయిగా నిద్రపోయి అంతరించిపోతున్నకాని దారిఎటుచూపినా యుగాధంగా యుగసమ్మతంగా వుండాలి. తుష్టిపుష్టులు నాలోనేను ఉంటే ప్రయాణానికి వచ్చి గౌరవనీయులైన మనపూర్వుల అడుగు జాడలలో రెక్కలు గట్టుక విహరిద్దామని తలచాను. సమాజములోని ఒడుదుడుకులను సహింపలేక దాగిపోని కుళ్ళును నిర్మూలించాలని చెప్పదలచాను. కాని నాలో తగిన సమర్థతలేదు. ప్రయత్నముచేస్తే సాధించలేనిదేమీలేదను నెపోలియను సూక్తి సుస్థిర వాక్యము నాలో గింగురుమన్నది. కలముపట్టాను తొలిరేఖ ప్రసరించింది. నా ప్రయత్నములో నేనెంతవరకు విజయాన్ని సాధించానో నిర్ణయింపవలసినది మీరు.

జనబాహుళ్యాన్ని మనస్సులో వుంచుకొని నవ్యసాహితి పోకడలననుసరించి ఈ ప్రథమ ప్రయత్నములో వ్యవహారిక భాషను వాడాలని సర్వశక్తులా ప్రయత్నించాను.

ఈ గ్రంథ ముద్రణకు సహకరించిన సహృదయులలో చెప్పుకోదగ్గవారు శ్రీ శీలం అల్వాల్‌రెడ్డి–పాతెల్లిగారు మరియు దూదిపాల పుల్లారెడ్డి వకీలు–దేవరకొండ గార్లకు అత్యంత కృతజ్ఞతాభివందనములు.

ఉదార స్వభావముతో యాశీస్సునొసంగిన శ్రీమాన్ పండిత యన్. శఠగోపాచార్యులవారికి; శ్రీ అజ్మతుల్లాకప గారికి మరియు పరిచయమువ్రాసిన శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి ఎమ్. ఏ గార్లకు నా కృతజ్ఞతాభి వందనములు అర్పించుతున్నాను.

ఇట్లు
రచయిత

# భగ్నజీవులు

—:0:—

ఉదయం నుంచి ఆకాశమంతా మేఘావృతమై భయంకరమైన నృత్యం చేస్తుంది. ప్రచండవేగంతో గాలివాన వస్తుంది. మేఘాలు వికటాట్ట హాసం వేసుకుంటు భీకరంగా గర్జించుతున్నాయి. గంటలు గడచిపోతున్నవి. రాత్రి పదిదాటింది. ఆకాశాన్ని ఆవరించిన మేఘాలు ఇంకా తీవ్రరూపం దాల్చి కుంభవర్షాన్ని కుమ్మరిస్తున్నాయి. గాలిదెబ్బకు ఆభవనము యొక్క తలుపుల గడిపూడి ఒక్కసారి ఠమని తలుపులు తెరచుకున్నాయి. లోపలికి వాన కొట్టుతుంది.

'ఒరెరాము ! వానకు ఇల్లంతా తడుస్తుంది తలుపులు వేసిరారా? అని మూర్తి నౌకరు కుర్రాణ్ణి అజ్ఞాపించాడు. రాము తలుపులు వేయటానికి పోయాడు. బయట ఎవరో వర్షానికి తట్టుకోలేక బాధపడుతున్నారు. అతనిని చూడగానే రాముకు జాలివేసింది.

'లోపలికిరండి బాబాయ్!, అయ్యో అలా వానలో తడుచుకుంటు నిల బడ్డారేమి? అని పిలిచాడు.

'పోవటమా ! మానటమా !, అని తటపటాయిస్తున్నట్లుంది అతని ముఖం. రాము ఇది తెలుసుకొని,

"మిమ్ములనే బాబాయ్ ! లోపలికి వచ్చి నిల్చోండి ! ! అన్నాడు.

'ఎవర్రా? లోపలకు రమ్మని పిలుస్తున్నట్లున్నావే!, అని మూర్తి కేక వేశాడు.

'ఎవరో బాటగాడు తడనిలబడ్తానంటాడు!' రాము జాలిగా అన్నాడు.

'పాపం! వారిని లోపలికి రమ్మను!' అన్నాడు మూర్తి.

అతడు లోపలికి అడుగుపెట్టాడు. సుమారు ముప్పది సంవత్సరాలుంటవి. మాసినగడ్డం, చినిగిపోయిన చొక్కా, పగిలిపోయిన ధోవతి అతని స్థితి చూసి మూర్తి ప్రాణాలు పైపైనే లేచిపోయినట్లనిపించినాయి అతని బట్టలు, తలా అంతా తడసిపోయింది చలికి అతని శరీరం వణికి పోతుంది. నిజంగా మూర్తి శాంత స్వభావి. సంస్కార ప్రియుడు, విశాల హృదయుడు. ఒకరి హృదయంలోని బాధను అర్థం చేసుకునే కరుణా హృదయుడు.

'అరెరె....అంతా....తడసిపోయ్యారే!... ఒరే రాము త్వరగా బట్టలు తెచ్చి యివ్వరా!' అన్నాడు మూర్తి.

'నాకోసరం మీకెందుకీ శ్రమ! అవసరం లేదండి!' అన్నాడు అతను

'ఎవరైనా ఇంటికి వచ్చినపుడు అతిధిగా చూడటం ప్రతి యొక్కరి విధి!' అన్నాడు మూర్తి.

'నేను అతిథిని కానే! మీ అతిథ్యాన్ని స్వీకరించటానికి' అన్నాడు.

'ఇంట్లో అడుగుపెట్టినవారే మాకు అతిది–అలావచ్చినవారు మా ఆతిథ్యాన్ని తప్పక స్వీకరించాలి! లేనట్టయితే మాకు తీరని అవమానం అని మూర్తి నవ్వుకుంటూ ఆశ్చర్యంగా జవాబిచ్చాడు. అతడు ఇక మారు పలుక లేకపోయాడు. రాము బట్టలు తెచ్చి యిచ్చాడు. అతడు తల తుడుచుకుని పొడిబట్టలు కట్టుకొని కుర్చీలో కూర్చున్నాడు.

'పాపం! మీరు వర్షానికి చాలా ఇబ్బంది పడ్డట్టున్నారు?' అని మూర్తి తన ఓదార్పును వెలిబుచ్చాడు.

బయట వర్షం కొద్దిగా తక్కువైంది.

'ఒరె రాము! చాలా పొద్దుపోయింది. భోజనానికి సిద్ధము చేయరా!' అన్నాడు మూర్తి.

టేబిలు మీద రాము భోజనం సిద్ధపర్చాడు.

'భోజనం సిద్ధము చేశాను బాబుగారు!' అని రాము కేకవేశాడు రాము కేకవిని మూర్తి లేచి.

'చాలా ప్రొద్దైంది భోజనానికి లేవండి!' అంటూ మూర్తి అతనిని తొందర చేశాడు.

'వద్దండి! ఇప్పుడు నేను తినలేను' అతనన్నాడు

'మీరు భలె వారండి! ఇంటికి వచ్చిన అతిథిని లాంఛన ప్రాయంగా సత్కరించటము మావిధిఅని యిదివరకే చెప్పానుగా! అని మూర్తిఅన్నాడు అతడు ఇక వేరేమి మాట్లాడలేక పోయాడు. చిన్నగా మూర్తివెంబడే నడచాడు

'ఒరెరాము! అమ్మగారేమి (మాట్లాడలేక పోయాడు) చిన్నగా మూర్తి వెంబడే నడచాడు,

'ఒరె రాము! అమ్మగారేమి చేస్తున్నారురా?' ప్రశ్నించాడు మూర్తి.

'చాలా రాత్రయింది, పండుకున్నారు బాబుగారు' అనిరాముఅన్నాడు

మూర్తి బి. ఎ. యల్, యల్. బి చదివి ప్లీడరు పనిచేస్తున్నాడు. పేరు ప్రతిష్టలు సంపాదించుకొని గొప్ప న్యాయవాదిగా పేరు పొందాడు. ఈవిశాల భవనములో మూర్తి. అతని భార్య నిర్మల, చెల్లెలు అరుణ, నౌకరు రాము మాత్రమే ఉంటారు. అరుణకు యింకా పెళ్లికాలేదు. ఆమె యమ్. బి. బి. యస్ చదివి డాక్టరు వృత్తి అవలంబించింది. ఈమె మూర్తికంటె రెండుసంవత్సరములే చిన్న. ఈమె ఇంతవరకు పెండ్లి ఎందుకు చేసుకోలేదోఎవరికికూడ అర్థముగాదు....?

'అరె! మీ....పేరే అడగటం మరచిపోయాను?' అని మూర్తి భోజనానంతరం అయిపోయిన తర్వాత కుర్చీలో కూర్చుంటు ఆశ్చర్యంగా అన్నాడు.

శేఖర్....! అన్నాడు

ప్రస్తుతం మీరేమి చేస్తున్నారు? మూర్తి ప్రశ్న

ఏమిలేదండి!

ఏమీ లేకుంటె మరి మీ జీవనం... ?

........................................?

అతను మూర్తి వేసిన ప్రశ్నకు ఏమి సమాధాన మియ్యలేక పోయాడు కాని, రెండు కళ్ళ నుంచి మాత్రము కన్నీరు ఏకధారగా విరామము లేకుండా కారుతుంది.

ఏమండి! అలావున్నారేమి... ? మూర్తి జాలిగా ప్రశ్నించాడు.

ఏమిలేదండి !........అని కన్నీరు తుడుచుకుంటు సమాధానమిచ్చాడు

ఏమిలేకుంటె మీరాలా ఎందుకు బాధ పడుతున్నారు? మీరేదో రహస్యం దాస్తున్నారు. ముఖాన్ని చూస్తేనే తెలిసిపోతుంది. మీ జీవితానికేదో బలమైన గాయమే తగిలినట్లుంది. అసలు ఏం జరిగింది. ఎందుకేడుస్తున్నారు? మీరీవిషయం చెప్పితీరాలి! ' అని మూర్తి పట్టుబట్టాడు.

'ఏమిలేదండి ! చెప్పటానికేముంది... ? నేను బాగానే వున్నానుగా ! మీరు పొరపడుతున్నారు....? ' అని శేఖర్ కండ్లు తుడుచుకుంటుఅన్నాడు

'అలా అనకండి....మీరు తప్పక చెప్పి తీరాలి! ' అని మూర్తి శేఖర్ చేయిని పట్టుకొని బ్రతిమాలు కున్నాడు.

'నన్ను ఇంతగా సత్కరించిన మీలాంటి సహృదయులకు చెప్పక పోతానా?....వినండి ! ' అన్నాడు.

,నేను మూల నక్షత్రములో పుట్టాను. దురదృష్టవశాత్తు నేను మొదటి దశలోనే మా నాన్నను కోల్పోయాను. అందువలన నన్ను అందరు అవహ్యించుకునేవారు. మాకు బాగానే ఆస్తివుంది. 'కాకిపిల్ల కాకికిముద్దు'అన్నట్లు మా అమ్మ నన్ను దూరము చేయలేదు. నాతోడ బుట్టిన అన్నయ్య కూడ వున్నాడు. అన్నయ్య పెళ్ళి నా చిన్నతనములోనే అయిందని విన్నాను,నాకు మాత్రము జ్ఞాపకం లేదు. నేను మా అమ్మ దక్షతలోనే ఇంతవాణ్ణిగా అయ్యాను. మాకు దగ్గర బంధువులు చాలామంది వున్నారు. వారిలో మా మేనమామ ఒకరు. వారు చాలా బీదవారు. పేదరికంవారిని నిరుపేదలుగా చేసింది. మా నాన్న చనిపోయిన తరువాత వారు మా ఇంట్లో వుంటున్నారు.

వారికొక కూతురు మాత్రముంది. ఆమెపేరు శారద. శారద పుట్టగానే తన తల్లిని కోల్పోయింది. ఆయన యింతవరకు మరల పెండ్లిచేసుకోలేదు మామయ్య మాకు అడపతడప సహాయపడేవారు. చిరకాలం బంధుత్వము నిలుపుకోటానికి శారదను నాకిచ్చి పెండ్లిచేయాలని మామయ్య అనుకునే వారు ఆ ఆశతోనె మా మామయ్య మా ఇంటికి వచ్చాడు. మామయ్య చాలా మంచివారు. నాకు చిన్నప్పటినుంచి శారదను చేసుకోవటానికి అభీష్ట ముండెను. శారదకుకూడ నేనంటె చాలా ప్రేమ. మామయ్య అప్పుడల్లా నేను చాలా సంతోషించేవాడిని. మా అమ్మ మాత్రమునవ్వేది. అంతకుమించి ఆమె ఏమి అనలేకపోయేది. ఈ మాట వినగానే శారద ముఖం కూడ వక్కని చిరునవ్వులతో ఆమె పెదవులు చిందులు తొక్కుతుండేవి. శారద నిజంగానే అపురూపసుందరి. ఆమె యౌవనం, సౌందర్యం నాకు వర్ణించ శక్యముకాదు. నాకు యిప్పటికి జ్ఞాపకముంది. శారద రంగు రంగుల చీరలు కట్టి, తలలో పువ్వులు పెట్టుకొని కలకలలాడుతుంటే, నేను గుటకలు మ్రింగుతు తీరని కోరికలతో పరితపిస్తూ వుండేవాడిని. అసలు భగవంతుడు శారదను నాకోసరము ప్రసాదించాడా....? నేను శారద కొరకే జన్మించానా? అని అనుకునేవాడిని. కాలం గడుచుతున్న కొలది నాకు శారదపైన ఎక్కడ లేని ప్రేమ, అనురాగం కలుగజొచ్చింది.

నేను కాలేజి చదువుకు పట్నము పోయాను. నేను కాలేజిలో చదువు తున్నానని మాత్రమేగాని ఎప్పుడు శారద రూపురేఖలను మదిలో చిత్రించుకొని ఆనందించేవాడిని. వీలయినప్పుడల్లా శారదకు ఉత్తరాలు రాస్తూవుండే వాడిని. అప్పుడప్పుడు శారదకూడ రాస్తూవుండేది. ఇదంతా రహస్యంగానే జరిగింది.

ఒకసారి కాలేజి సెలవులకు ఇంటికి వచ్చాను.

రాత్రి పదిగంటలు కావస్తూంది. సముద్ర ప్రవాహంనుంచి చల్లని పిల్ల గాలులు తెరలు తెరలుగా వచ్చి మనస్సుకు ఆనందాన్ని చేకూరుస్తున్నాయి. మల్లెల సువాసనలు గాలిలో తేలి వచ్చి మనస్సును పులకింపచేసి మరిపించి

ఉక్కిరి బిక్కిరి చేస్తుంది. నేను ప్రకృతి శోభను తిలకిస్తూ అగాధమైన బాధ ననుభవిస్తూ మేడపై పండుకున్నాను. పున్నమ చంద్రుడు ఆకాశంలో ప్రకా శించుతున్నాడు. వీధంతా, నిర్మానుష్యంగావుంది. శారద మా అమ్మ ప్రక్కన గాఢమత్తులో పనపై నిద్రపోతుంది. నాకుమాత్రం నిద్రపట్టలేదు. అంతులేని ఊహలు రగులుతున్నాయ్. మనస్సులోని భావాలు సముద్ర కెరటాలుగా వచ్చి హృదయానికి కొట్టుకుని విచ్చిన్నమై పోతున్నాయి. బలవంతంగా నిద్ర పోదామని ప్రయత్నించాను. ఫలితం శూన్యం. శారద సౌందర్యాన్ని తిలకిస్తూ నాలో పొంగి పొరలి వచ్చే ఆ వేశాన్ని అణుచుకోలేక పోయాను. మెల్లగా శారద దగ్గరికి పోయాను.

"శారద....లే....!" చిన్నగా శారద భుజముపై చేయివేసి కదిలిం చాను. శారద బద్ధకంగా మూలుగుతూ అటుఇటు పొర్లుతుంది. చిన్నగా కండ్లు తెరచి నన్ను చూసింది.

'ఏమిటీ బావ!....ఇంత రాత్రి నాతోటి మీకేమి పని? అత్తయ్య చూస్తే ఏమంటుంది....?' అని శారద లేచి కండ్లు తుడుచుకుంటూ సమాధాన మిచ్చింది.

'చెప్పుతానుగా! రా నావెంబడ' అన్నాను.

ఇద్దరం చిన్నగ అడుగుల్లో అడుగులేసుకుంటు పెరట్లోకి పోయాము. మిలమిల మెరిసే ఆమె సౌందర్యము చూసి నాలోని భావాలు దొంక తిరుగుడు తిరిగాయ్.

'శారదా! అలా ఆకాశంలో చూడు. తారా–చంద్రులు ప్రేమకోసరము ఏవిధంగా పరితపిస్తున్నారో....? పాపం! వారిద్దరిని ఆ మహాముని శపించక పోతే....?' అని శారద భుజముపై చేతులువేశి అన్నాను.

'ఇందుకేనా బావా నన్ను పిలుచుకొచ్చింది....? అయితే మనిద్దరిని కూడ అలాగే అనుకుంటున్నావా?' శారద అంది.

'లేదు శారదా! అలా ఎప్పటికి జరగదు. మనిద్దరిని ఎవరుకూడ వేరు చేయలేరు. లోకంనుంచి దూరమైతేనే అలా సాధ్యపడుతుంది. నేను నిన్ను

ఎంతగానో ప్రేమిస్తున్నాను. మన పవిత్ర ప్రేమను ఎవరు భగ్నముచేయ లేరు.' అని శారదను నా కౌగిలిలో బలవంతంగా బంధించివేశాను.

'ఊఁ....హుఁ....అలాగా!' భగవంతుడె వేరుచేస్తే?' అని శారద నా కౌగిట్లో ఆనందముతో పరవశమై ఉక్కిరి బిక్కిరితో నా తలను నిమురు తూంది.

'అలా ఎప్పటికి జరుగదు' అని శారదతలనుగట్టిగా గుండెకు అలము కొని గాలికి అలలుహాదిరిగా ఎగిరిపోతున్న నల్లటి కురులను సవరించుతూ ముఖాన్ని దగ్గరికి లాక్కొని చెక్కిళ్ళపై చేతులేసి పెదవులపైన గాఢంగా ముద్దుపెట్టుకున్నాను.

'వద్దు బావా? మూడు ముళ్ళు పడ్డతర్వాతనే మనిద్దరికి స్వేచ్ఛ' అని శారద నా కౌగిలిలో నుంచి తప్పించుకొని పారిపోయింది.

తెల్లవారింది. మామూలు వేళకే నిద్రనుంచి లేచాను. లేచిన క్షణమే రాత్రి జరిగిన విషయం జ్ఞప్తికివచ్చింది. నేనుశారదనే పెళ్ళి చేసుకుంటానని' అమ్మకు చెప్పాలని నిశ్చయించాను.

'శేఖర్! పెళ్ళెప్పుడు చేసుకుంటావురా? శారదపెళ్ళి నీ పెళ్లిచేయాలని అనుకుంటున్నాను. వచ్చే వైశాఖమాసంలో జర్పించాలనుకుంటున్నాను. నేను ముసలిదాన్నై పోతున్నాను. నీ పెళ్లి నా కళ్ళముందే జరిగితే బాగుం టుంది. ఇంతకాలం పెంచి పెద్ద చేసినందుకు మాకు ప్రతిఫలముంటుంది' అమ్మ అన్నం పెడుతూ అంది.

నేను అమ్మమాటలు సరిగా అర్థముచేసుకోక ' సరే! ' అన్నాను. అమ్మముఖం ఆనందంతో తామర పువ్వులా వికసించినది. మొదటి టర్మ్ సెలవులయిపోయినవి. నేను మరల పట్నంపోయాను. మామయ్య శారదను

నా కిచ్చి పెళ్లి చేయమని అమ్మనడిగాడట! కాని, అమ్మ ఒప్పుకోలేదట! నాకు మంచి కలవారి సంబంధము చూసి చెయ్యాలని అమ్మ అభిప్రాయమట.... !

ఒకనాడు నాకు ఇంటి దగ్గఱ నుంచి మా వదినకు ఏం బాగా లేదని టెలిగ్రాం వచ్చింది. నేను, ఇంటికి పోకముందే మా వదిన చనిపోయింది. ఇల్లంతా విచారము తో మునిగిపోయింది. మా అన్నయ్య ఏకాకైపోయాడు. మా వదిన పదినెలల పసిపాపను విడచిపోయింది. పాపం! ఆ పసిపాప సంరక్షణ బారమంతా శారదపైన పడింది. శారద ఎప్పుడు ఆ పసిపాపతోటె కాలక్షేపం చేసేది. ఒక్క క్షణం కూడ శారద ఆ పసిపాపను విడచి వుండేది కాదు. మా అమ్మ ఇదంతా చూసి మనస్సులో చాలా ఆనందించేది. ఇది నేను బాగా తెలుసుకున్నాను. ఈ విధంగా కొంతవరకు మా అన్నయ్య విచారము శారదతో దూరమైంది. కొన్ని రోజుల తర్వాత తిరిగి నేను పట్నము పోయాను.

వేసవికాలం సెలవులలో ఇంటికి వచ్చాను. ఇల్లంతా పెళ్లికళతో కళ కళలాడుతుంది. అది చూసి ఒక్కసారే నా హృదయం ఆగిపోయింది.నాకు ఏటు ఏమి అర్థము కాలేదు. ఎవరిపెళ్లి....? నాకు తెలియకుండానా?' అని అనుకున్నాను.

'అమ్మా ! ఏమిటీ ఇదంతా?' అమ్మను ప్రశ్నించాను.

'మీ అన్నయ్య పెళ్లి నాయన ! ' అమ్మ అంది.

'ఎవరితోటి....?' అమ్మను మరల ప్రశ్నించాను.

'శారదతో....' అమ్మను అంది.ఈ మాట అమ్మనోటినుంచి వినగానే నా తల గిఱ్ఱున తిరిగిపోయింది.

'శారద ఈ పెళ్లికి ఇష్టపడింవా....?' అమ్మను తిరిగి అడిగాను.

'ఇష్టపడింది నాయన! నీకుతెలుపు దామనుకున్నాము. నీవేలాగైనా పరీక్షలు కాగానే ఇంటికి వస్తానని ఉత్తరము వ్రాశావుగా!' అని అమ్మ వెళ్లిపోయింది.

ఈ పెళ్లికి శారద ఎలా ఒప్పుకుంది. ఇది మహా ద్రోహం! అన్యాయం! నన్ను మనసార ప్రేమించిన శారద అన్నయ్యను చేసుకోవటానికి ఎలా ఒప్పుకుంది? ఛీ! నిజంగానే ఆడవాళ్లను నమ్మకూడదు. 'ఆడవాళ్ళ మాటలకు అర్థాలు వేరులే' అన్న సినిమాలోని, పాట జ్ఞాపకమొచ్చింది. నాకు ఆటు తర్వాత తెలిసింది. శారదకూడ అన్నయ్యను చేసుకోవటానికి మనస్ఫూర్తిగానే ఇష్టపడిందట! ఎందుకలా ఇష్టపడిందో నాకిప్పటికి అర్థము కాదు. అమ్మ పలికిన మాటలకు నా హృదయం అంతులేని ఆలోచనలతో ఆరాట పడుతు సమాధానము చెప్పుకోటానికి బాధపడుతుంది.

నల్లటి కాలసర్పము పడగ విప్పి బుసలు కొడుతూ వ్యధా పూరిత హృదయంపై నృత్యం చేస్తు కాటువేయటానికి సిద్ధంగా వుంది.

నేను ప్రాణ ప్రాయంగా ప్రేమిస్తున్న శారద తన స్థానములో నుంచి తప్పుక పోతుంది. నాకు వదిన కాబోతుంది. నాకోసం నా స్వార్థంకోసం నేనెందుకు మా అన్నయ్య ఆనందాన్ని బలిచేయాలి? నేనే ఆ ఆనందానికి దూరమైపోతే?' అని నిశ్చయించుకొన్నాను.

ఇందులో అన్నయ్య తప్పులేదు. ఇదంతా నాతప్పు! శారదను ప్రేమించటమె తప్పు! మా అన్నయ్య శారదను పెళ్లి చేసుకొని స్వర్గ సౌఖ్యాలను అనుభవిస్తాడు. నాకంతేచాలు. ఇక ఇట్లాంటి బుద్ధి తక్కువ ఆలోచనలు మనస్సులో వుంచుకోకూడదని శపథం చేసుకున్నాను. శారదను క్షమించమని వేడుకోవాలి. శారద నాకిప్పుడు వదిన!

పెళ్ళంతా అయిపోయింది. బంధువులందరు వెళ్లిపోయారు. వేసవి కాలపు సెలవులయిపోయినవి నా పరీక్షా ఫలితాలు కూడ తెలినవి. నేను B. sc. ఫస్టు క్లాసులో ప్యాసయ్యాను. కాని....లాభం....? నా పరిస్థితులన్నీ తలక్రిందులైనవి. నిర్లక్ష్యంగా తిరగటం ప్రారంభించాను. చెడు వ్యసనాలు అలవడిపోయినవి. మనశ్శాంతి కొరకు త్రాగుడు అలవాటు చేసుకున్నాను. నేను పక్కా త్రాగుబోతు నయ్యాను. డబ్బును అనవసరంగా ఖర్చు చేయు

...ం మొదలు పెట్టాను. వదినా అమ్మ అన్నయ్యలు నన్ను పదేపదే హెచ్చరిస్తూ వచ్చారు. కాని నేను త్రాగుడు మానలేదు. 'మూడు ముళ్ళుపడితేనేవాడు బాగుపడుతాడు' అని అమ్మ అనుకొని ఒకనాడు నన్ను అడిగింది.

'శేఖర్! నీవుకూడ ఒక ఇంటివాడవైతే నా బరువు తగ్గిపోతుందిరా!' అంది అమ్మ.

నేనసలు అదివరకే పెళ్ళి చేసుకో కూడదని నిశ్చయించుకున్నాను. నేనప్పుడు ఎందు కలా నిర్ధారణ చేసుకున్నానో నాకే తెల్వటం లేదు.

'నేనిప్పుడు పెళ్లి చేసుకోను' అన్నాను,

'ఎందుకురా? ఆవేం మాటలురా?తల్లిముందేనా నివు మాట్లాడేది! నికే మైనా మతిపోయిందా?' అంది అమ్మ ఆశ్చర్యముతో.

'నాకు పెళ్లి అవసరం లేదమ్మా! ముమ్మాటికి అవసరంలేదు' అని అన్నాను.

'నీవు పెళ్లి చేసుకోకపోతె, చూస్తూ చూస్తూ కన్నతల్లి ఎలా పూరుకుంటుందిరా? బాగా ఆలోచించుకో....ని జీవితాన్ని నాశనం చేసుకోకు. నీవాలా వుండటానికి వీలులేదు• కుటుంబ గౌరవానికి కళంకము తేకు. ఎవడు చెప్పాడురా నీకీ బుద్ధి. నేను బ్రతికున్నంతకాలం నీకు ఏబాధవుండదు. కాని, నేను పోయిన తర్వాత నీకు దిక్కెవ్వరు? మీ నాన్న బ్రతికుంటె నీవిలా అనేవాడివా? మినాన్న పోయాడు. నా బ్రతుకు మంట కలసిపోయింది' అని అమ్మ ఏడ్చుకుంటు అంది. అమ్మ కఠంస్వరుద్ధమైంది. కన్నీరు వరదలై కారుతుంది. అమ్మమాటలు వింటుంటే నాకు ఏడ్పొచ్చింది. కాని, నా నిశ్చయం మారలేదు. అన్నయ్య కూడ నన్ను పెళ్లి చేసుకోమని బలవంతం చేశాడు. నాకు శారద కూడ చెప్పిచూసింది. ఎవరెన్ని చెప్పినా నేను మాత్రం వినలేదు.

ఆనాటి నుండి ఇంట్లో వారందరూ నాతో మాట్లాడటము మానివేశారు. ఇంకా నా మనస్సులో పెళ్ళి చేసుకోకూడదని గట్టిగా నాటుకపోయింది.

ఈవిచారం వల్ల మా అమ్మకు జ్వరం రావడం మొదలుపెట్టింది. ఆమె తిరిగి జబ్బులోనుంచి కోలుకోలేదు. అమ్మను మృత్యుదేవత శాశ్వతంగా ఈ లోకం నుంచే దూరం చేయటానికి ప్రయత్నిస్తుంది. అమ్మ స్థితి చూసి నాకు భయము, దుఃఖము కలిగింది. అమ్మను ఎట్లాగైనా రక్షించా లనుకున్నాను. అమ్మ ప్రాణాలు నాశనం చేయటానికి నా మనస్సు ఇష్టపడ లేదు.

'అమ్మా! నేను పెళ్లిచేసుకుంటాను' అని అమ్మను ప్రతిమాలు కున్నాను. అమ్మ బాధగా కండ్లు తెరచి చూసింది. ఎన్నాళ్ళనుంచో ఆరెండు కండ్లుకూడ నా ఈ సమాధానము కోసరమెదిరిచూస్తున్నట్లున్నాయి.

'పెళ్ళి చేసుకో నాయన! పెళ్ళి చేసుకొని నీతిగా బ్రతకమని మీఅమ్మ తుది ఘడియలో నిన్ను వేడుకుంటుంది' అని మా అమ్మ నా నుండి వాగ్దానం తీసుకొని చనిపోయింది.

ఆనాటి అమ్మ వాగ్దానం నేటికి జ్ఞాపకముంది. అమ్మ చనిపోగానే నేను పిచ్చివాడ్నయ్యాను. మా అన్నయ్య నన్ను పిచ్చి ఆస్పత్రిలో చేర్పించాడు. కాని కుదురలేదు. కొన్నాళ్ళు జైల్లో వుంచారు.

నేను ఈరోజు పొద్దునే జైలునుంచి విడుదలైనాను.................? ఇదీ సంగతి అన్నాడు శేఖర్.

'నేను మహాపాపిని. పాపానికి ప్రాయశ్చిత్త మనుభవిస్తున్నాను. మూల నక్షత్రములో పుట్టినందుగా నాన్నను తర్వాత వదినను అమ్మను మ్రింగాను. నా సర్వస్వము కోల్పోయాను. నా బ్రతుకు మంట కలసిపోయింది. ఇప్పటికి కూడ అమ్మ వాగ్దానము నెరవేర్చాలని వుంది. కాని ఇప్పుడు ఈ పిచ్చివానికి పిల్లనెవడిస్తాడు. ప్రతిప్రాణికి ఈ లోకంలో కనుచూపు మేరన ఏదో ఆశ కనిపిస్తుంది. అలాంటి ఆశవుండబట్టే, ప్రాణి జీవించాలను కుంటాడు. ఇంతకాలం నేను దురభిమానముతో కాలం వెళ్ళబుచ్చాను. అప నిందలతో, అవమానములతో ఇంతకాలం భరించాను. కాని ఇక నేనుభరించ లేను. మానవుడు జీవితంలో ఏదో చేయ్యాలని తలుచుకుంటే, భగవంతుడు

వాన్ని తలక్రిందులుగా చేస్తాడు. ఇదంతా ఊహించినప్పుడు నాకు ఆశ్చర్యమూ కలుగుతుంది. సుఖమనుభవించలేని జీవి ఈ లోకంలో ఎందుకు బతకాలి? నిరుత్సాహాన్ని పూర్తి ఉత్సాహంగా మార్చుకునే శక్తి భగవంతుడు నా కివ్వలేదు. నాలాంటి భగ్నజీవులకది అసాధ్యం కూడా....! ఇప్పుడునన్ను సమాజము బహిష్కరిస్తుంది. నా దుష్ప్రవర్తన మూలంగా కుటుంబప్రతిష్ట గూడా చెడిపోయింది. ఇప్పుడు ఇంటికేలా పోయేది? ఏముఖం పెట్టుకొని పోవాలి? నన్ను పోషించేవాళ్లెవరు....?' అని శేఖర్ పిచ్చిపిచ్చిగా అనుకుంటు బాధగా ఒక నిట్టూర్పు వదిలాడు. వెంటనే 'అమ్మా....!' అని బాధతో గుండెను చేత్తో పట్టుకొని కుర్చీలో నుంచి క్రిందపడిపోయాడు. అతని స్థితి చూసి మూర్తి కంగారు పడిపోయాడు.

'ఏమిటి....శేఖర్....?' మూర్తి అతనిని లేవబట్టి ఆత్రుతగా పిలిచాడు. కాని అతను పలుకలేదు. బాధతో మూలుగు తున్నాడు, ఏదో పిడుగు పడ్డట్టు గదంతా నిశ్శబ్దమై పోతుంది. మూర్తి హృదయంలో అశాంతి వేయి ఘంటాలతో ఘోష పెట్టుతున్నది. అతనికి ఎటు తోయటం లేదు. వెంటనే సహాయానికి చెల్లెలు కొఱకు పరిగెత్తాడు.

తెల్లవారుతుంది. శేఖర్ తెలివి తెచ్చుకున్నట్టుగా కళ్ళు విప్పిచూస్తు న్నాడు. ఏదో అంటున్నాడు, కాని యెవరికి అర్థం కావటంలేదు. అతి కష్టం మీద తల యిటు అటు త్రిప్పుతున్నాడు. అరుణ అతనిని ప్రాణాపాయం నుంచి తప్పించటానికి శాయశక్తులా కృషిచేస్తుంది. ఫలితం శూన్యం. రాను రాను అతనిలో మూలుగు కూడ ఆరంభమయింది. మూతలు పడ్డ అతని కన్నులు మరొకసారి తెరచుకున్నాయి. ఇప్పుడు అరుణ అతనిని అతికష్టం మీద గుర్తుపట్టింది. మరుక్షణమే ఆమె యేకధారగా కన్నీరు కారుస్తోంది. ఇదంతా మూర్తికి అర్థం కావటములేదు. ఆమె కన్నీటి బిందువులు అతని కేదో సమాధానము చెప్పాయి. ఆ సమాధానమే ఆమె జీవితాన్ని బలిగొన్నది. ఆమె ఇంతకాలం పెళ్లెందుకు చేసుకోలేదో మూర్తికి అర్థమైంది.

శేఖర్ అరుణ యిష్టంగా క్లాసుమేట్లు. శేఖర తెలివితేటలు సౌందర్యము చూసి అరుణ అతనిని ప్రేమించినది. ఇంతకాలం ఈమె ఎవరికి చెప్పలేదు. శేఖరు కూడ ఈమెను ఎంతగానో అభిమానించేవాడు. అతని అరుణ అమెను చెల్లెలుగా చూసింది. ఈ మర్మం అరుణ తెలుసుకోలేకపోయింది. తనను ప్రేమిస్తున్నాడని నమ్మింది. సమయానుకూలంగా అతనిని అడుగుదామను కుంది. కాని....ఆమెకెప్పుడు అట్టి సమయము కలుగలేదు....?

అందరు ఆశలు విడుచుకున్నారు. అరుణ ఏడ్చి ఏడ్చి పీనుగు అయింది. మూర్తి ఇవంతా చూచి వచ్చే దుఃఖాన్ని పెదవులను నొక్కు కుంటూ ఆవుకుంటున్నాడు.

చాలా సేపటికి శేఖర్ అతిభారంగా కండ్లు తెరచి తన ప్రక్కనే వున్న అరుణను చూసి అమె తలపై చేయివేశి నిమురుతూ'సి....నా....అ....రు ణా....! ' అని అతికష్టము మీద అనగలిగాడు. అలా అంటూనే ప్రాణం విడి చాడు. అరుణ అతని భౌతిక దేహంమీద పడి భోరున ఏడుస్తుంది. మూర్తి ఆమెను పక్కకు తీసి ఆ భౌతికదేహం పై దుప్పటి కప్పాడు.

ఉదయం ఏడు గంటలు కావస్తోంది. శవాన్ని చూడటానికి వచ్చేవాళ్ళు వస్తూనె వున్నారు. అక్కడికి వచ్చిన కఠోర హృదయులు కూడ దిక్కులేని శేఖర్ శవాన్ని చూసి కన్నీళ్ళు కారుస్తున్నారు. పోలీసు లొచ్చి శవాన్ని పరీ క్షించి వెళ్ళిపోయారు. మూర్తి ఈ సంగతంతా తెలుపుతూ అతని ఇంటికి టెలిగ్రాం యిచ్చాడు.

ఉదయం పన్నెండు గంటల దగ్గరైంది. శేఖర్ అన్న, శారద వచ్చే సరికి శవాన్ని స్నానం చేయిస్తున్నారు. శారద వెలవెల బారిన ముఖంతో పుక్కిరి బిక్కిరి అవుతోంది. అమె అధ్వాన్నంగా తయ్యారైంది. ఆమెను చూచినవారందరు ఆశ్చర్య పోతున్నారు. అమె హృదయంలో మోపులు మిన్ను ముడుతున్నాయి. దానిని శారద అణుచుకోలేక వాతుంది.పిచ్చిపిచ్చిగా జుట్టంతా పీక్కుంటుంది.

తెలియకుండా రైలు ఎక్కుదామనుకున్నాడు. కాని కుదరలేదు. విపిన్‌బాబు, అజయుడు ఆనందుడి ప్రాణస్నేహితులు.

'ఎక్కడికిరా అంత అర్జెంటుగా పోతున్నావ్?' అన్నాడు విపిన్‌బాబు ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ.

ఆనందుడికి ఏమి సమాధానమియ్యాలో తోచలేదు. అతని మనస్సును భరించలేని ఆపాదమస్తకంతా కుదిపివేస్తుంది టెలిగ్రాం. నిర్మించుకున్న ఆశలన్నీ తిరిగి రగులుకొని హృదయములో జ్వాలలా మండుతోంది....భరించలేక బాధపడుతున్నాడు.

'ఇంటిదగ్గరినుంచి టెలిగ్రాం వచ్చింది' అన్నాడు.

ఆ సమాధానమిని మిత్రులిద్దరు ఆశ్చర్యపోయ్యారు.

'ఎందుకురా అంత అర్జంటుగా టెలిగ్రాం వచ్చింది? ఏదైనా ప్రమాదమా....?' అన్నాడు అజయుడు.

'ప్రమాదం ఏమిలేదు, కాని....ఎందుకో నాకు తెల్వదు' ఆనంద్ టెలిగ్రాం చూపుతూ....

'ఇందులో ఏదో రహస్యముంది ఆనంద్!' అన్నాడు విపిన్‌బాబు టెలిగ్రాం చూస్తూ.

'లేకుంటె అంత అర్జంటుపని ఏముంది? అయితే, కారణం....ఇందులో ఎందుకు లేదు? ఇందులో ఏదో చిదంబర రహస్యము ఇమిడివుంది.' అని అజయుడు తన అభిప్రాయం వెలిబుచ్చాడు. ఇంతలో రైలు బ్రహ్మరాక్షసిలా కూతపెట్టింది, ఆనందుడు అదరా బాదరా మిత్రులతో కరచాలనము చేసి పరిగెత్తి రైలు ఎక్కాడు. రైలువేగం చిన్నగా హెచ్చుతూ స్టేషన్ వదలి పోయింది. పరుపుచుట్టను సర్దిపెట్టి ఆనందుడు సీటులో తాపిగా కూర్చున్నాడు. ఒక్కసారి కంపార్టుమెంటునంతా కలియచూశాడు. అంతా అపరిచితులే కనిపించారు. రైలు శరవేగముతో వెళ్లుతుంది. ఇంతలో వున్నట్టుండి ఆనందునికి విచిత్ర సంభాషణ వినిపించింది.

'ఏమండీ ఎక్కడికి పోతున్నారు?' అని ఒక ప్రయాణికుడు రెండవ ప్రయాణీకుని ప్రశ్నించాడు.

'నా కుమారుడు పారిపోయాడు. వెతకటానికి వెళ్ళుతున్నాను' అని, రెండవ ప్రయాణికుడు కన్నీళ్ళు తుడుచుకుంటు సమాధానమిచ్చాడు.

'జీవితము మీద అతనికి అంత విరక్తి ఎందుకు కలిగింది? మొదటి ప్రయాణికుడు.

'అతనికి తెలియకుండ పెళ్లి నిశ్చయించాము. ఆపెళ్ళి అతనికి ఇష్టము లేదు' రెండవ ప్రయాణికుడు,

'అయితే పెళ్లికూతురెవరు?' అని మొదటి ప్రయాణికుడు ఆతృతగా అడిగాడు.

'వాడి మేనమామ్మ కూతురే! పాపం! వాళ్ళు చిన్నప్పటినుంచి పేరు పెట్టుకున్నారు. ముహూర్తం నిశ్చయించిన తర్వాత....ఇదీ జరిగింది' జలజల కన్నీరు కార్చుతు రెండవ ప్రయాణికుడు అంటున్నాడు.

ఇదంతా ఆనందుడు చదువుతున్న పత్రికను ఎదుటి పెద్దమనిషికిచ్చి ఆ సంభాషణ వింటున్నాడు.

'పాపం! అతనికి తెలియకుండ పెళ్లి నిశ్చయము చేస్తే పారిపోక ఏం చేస్తాడు? వెనుకటి కాలాలు పోయావి. మేనపిల్లను తప్పక మెడకు కట్టుకో వలసిందే అనే నిబంధన పోయింది...... కాలం మారింది....కాలానుగుణ్యంగా వారి స్వభావాలు కనిపెట్టి మనము నడుచుకోవాలి. నేటియువకులు అంత తెలివి తక్కువవారు కారు. చెప్పినదాని కల్లా గంగిరెద్దులా తలకాయ లూపటానికి' అని మొదటి ప్రయాణికుడు అన్నాడు.

ఈ సంభాషణ వినుటముతోటె ఆనందునికి మేనమామ కూతురు జ్ఞాపకమొచ్చింది.' వారు కూడ చిన్నప్పటినుంచి మాతమ్మునికి యిస్తామని పేరు పెట్టుకున్నారు. తుదకు ఆతడు నిరాకరించాడు. అక్కడికి అంతటితో ఆగిపోయింది.' అది ఆనంద్ మనస్సులో మెదిలింది.

జగదీశ ఆనందుని తమ్ముడు. ఆనంద్ కంటె ఒక సంవత్సరము చిన్న మంచి తెలివిగలవాడు. సౌందర్యములో మన్మధుని మించి పోయాడు. ఎమ్. బి. బి. యస్. చదివి డాక్టర్ వృత్తి అవలంబించాడు. చదువులో ఆనంద్ వెనుకబడిపోవటానికి కారణం తెలియలేదు. కొన్నాళ్ళు [illegible] ఉద్యోగము చేశాడు. ఉద్యోగానికి రాజీనామ యిచ్చి యిప్పుడు బి.ఏ. చదువు తున్నాడు. ఆనందునికి ఆ [illegible] లేదు. అతని [illegible] ఎవరు [illegible] డు. కన్నతల్లిమాత్రమే అతనిని ప్రాణప్రాయంగా చూస్తుంది. తల్లి అభిమానం తప్ప అతనికి ఆ ఇంట్లో ఎవరి ఆదరణలేదు. చిన్నతనమునుంచి ఆనంద్ ఆవిధంగానే పెరిగి పెద్ద వాడయ్యాడు. మనస్సుకు శాంతిలేక ఆనంద్‌కు చపల చిత్తం అలవడిపోయింది. అతనికి మనస్సు ఎప్పుడు ఒకే స్థాయిలో వుండదు. కొద్ది విషయానికే ఎంతగానో ఆరాటపడుతాడు. మనస్సును పాడుచేసుకుంటాడు. అతని మనస్సుకు శాంతిలేదు. 'భగవంతుడు ఆనందుని అల్లా సృష్టించాడు,' అని లోకం అనుకుంటుంది. దీనికి కారణమేమిటని లోకం గుర్తించదు. కుటుంబములో కన్నవారిమీద ఈ హెచ్చు తగ్గులెందుకో....?

ఆనందుడు కిటికీవైపు దృష్టి మరలించాడు. అతనికి తెలియకుండ కన్నీళ్ళు పటపట మని క్రింద రాలిపోతున్నాయ్! ఏదోనిగూఢ రహస్యంఅతని జీవితాన్ని ఆవరించి వుంది. ఏదో తెలియనిబాధ కలగుతుంది. ఎవరికి అతని మనస్తత్వం బోధపడటంలేదు. నిశ్శబ్దాన్ని చీల్చుకుంటు రైలు శరవేగముతో పోతుంది. వేగముతో పాటు ఆలోచనలు అతని మనస్సులో పరుగులు తీస్తున్నాయ్. చెట్లు, గట్లు పరుగులేసుకుంటు వెనకకు పోతున్నాయ్! ఇంతలో రైలు ఆగిపోయింది. ఆలోచిస్తున్న ఆనందుడు కిటికీనుండి లోపలి వైపు తిరిగి చూశాడు. అందరు దిగటానికి సిద్ధమౌతున్నారు. అతడు దిగవలసిన స్టేషన్ కూడ అదే! అందరితోపాటు అతనుకూడ దిగాడు.

ఇక్కడికి ఆనంద్‌పూరు రెండుమైళ్ళు. అది ఒక చిన్న పల్లెటూరు. ఆనంద్ తండ్రి పెద్దజమీందారు. పేరుధర్మదాసు. పేరుకుతగ్గ గుణాలు అతనిలో లేవు. యితనికి ఇద్దరు కొడుకులు మరియొక కూతురు మాత్రమే.

ఆనంద్ బెడ్డు చేతులో పట్టుకొని చిన్నగా బయలుదేరాడు. దారిపొడుగునా టెలిగ్రాం గురించే ఆలోచించు కుంటు ఇంటికి చేరుకున్నాడు. ఆ యింట్లో ఆనందుని రాకకు ఏదో ప్రత్యేకత చూపుతున్నారు.

'అమ్మా! అన్నయ్య వచ్చాడె!!' అనుకుంటు పదిహేండ్ల సుశీ పరిగెత్తింది. సుశీ ఆనందుని చెల్లెలు. ఈ వార్త వినగానే తల్లి హృదయం ఆనందముతో పరవశమైంది. ఆనందుని దృష్టిలో ఆ యిల్లు కూడ నలుదిక్కుల నుంచి నూతన కాంతిని వెదజల్లుతు అతనిరాకకు స్వాగతమిస్తున్నట్లుంది.

'ఇప్పుడే నా రావటం...? తల్లి వచ్చి ఆనందుని అడిగింది.

'అవునమ్మా!' ఆనందుడు జవాబిచ్చాడు.

'నాన్న అంత అర్జంటుగా టెలిగ్రాం ఎందుకిచ్చాడమ్మా?' అని ఆనంద్ తిరిగి తల్లిని ప్రశ్నించాడు.

'ఏమో నాయన! నాకు తెల్సాదు' అనలు రహస్యము దాస్తు జవాబిస్తున్నట్లుగా వుండింది అమె ముఖభంగిమ.

అప్పుడే ఆనంద్ తండ్రి ధర్మదాసు ఎక్కడనుంచో వచ్చారు. కొడు రాకను చూసి,

'ఇప్పుడె నా రావటం? ఆనంద్!' అని ప్రశ్నించాడు.

'అవును నాన్న!' అని ఆనంద్ జవాబిచ్చాడు. టెలిగ్రాంఎందుకిచ్చాడో అడుగుదామనుకున్నాడు కాని జడిచి అడుగలేకపోయాడు.

భోజనాలయిపోయినవి. అనందుడు పండుకోవటానికి డాబామిదికి పోయాడు. చంద్రుని చల్లటి వెన్నెలతో ప్రకృతి శోభ కళకళలాడిపోతూ ఒడలు విరిచి నాట్యం చేస్తోంది. చల్లటి పిల్లగాలులు మెల్లగా వీస్తున్నాయి. దీర్ఘంగా ఆలోచిస్తున్న అతని హృదయానికి ఆనందం చేకూరటములేదు. నల్లటి మబ్బులలో నుంచి తెల్లటి చంద్రుడు తొంగితొంగి చూస్తున్నాడు. ఇంతలో సుశీ అక్కడికి వచ్చింది 'అన్నయ్యా! పట్నము నుంచి నాకేమి తెచ్చావు?' అని సుశీ ఆనందుని భుజముపట్టుకొని వూపుతు, అతని ఆలోచనలకు అంతరాయము కలిగిస్తు అంది.

'తెచ్చానమ్మా!' అని ఆనందుడు చెల్లెలు కోసరము తెచ్చిన వాటిని యిచ్చాడు

అవి తీసుకొని సుశి ఎంతో ఆనందముతో చప్పట్లు కొడుతు మా అన్న య్య మంచోడు. నేను కోరినవి తెచ్చాడు' అని గంతులువేస్తుంది. ఆనం దుడు చెల్లెలు అమితానందము చూసి చాలా సంతోషించాడు.

'మా అన్నయ్య పెండ్లి

పెండ్లికి మంచి బహుమతులు

తెచ్చి యిస్తాడు!' అని సుశి పాడుతు గంతులేస్తుంది. ఆనందునికి సుశి పాడే పాట ఎటు ఏమి అర్థము కాలేదు. టెలిగ్రాం వచ్చింది ఇందుకేనా లేకుంటే నాన్న అర్జెంటుగా ఎందుకు టెలిగ్రాం యిస్తాడు ఇందులో ఏదో రహస్యముంది. సుశి ద్వారా రహస్యము తెలుసుకోవాలని నిశ్చయించాడు.

'ఏమిటి ఆ వెఱ్ఱిపాట?' అని సుశిని ప్రశ్నించాడు.

'నీకు తెలియదా అన్నయ్యా' అని సుశి ఆనందుని దగ్గరగా కూర్చొని ఆశ్చర్యంగా అంది.

'నాకు తెలియదే!' అని ఆశ్చర్యంగా అన్నాడు.

'ఏమిటి నీకు తెలియంది అన్నయ్యా!' అంది సుశి నవ్వుతూ. సుశినవ్వు ఆనందునికి అర్థము కాలేదు.

'ఏమిటమ్మా! ఆ వెఱ్ఱినవ్వు' అని ఆనందుడు అన్నాడు.

'నీపెళ్లి అన్నయ్యా!' అని సుశి అంది. పెళ్లి అనగానే ఆనందుడి గుండె పగిలినంత పనయింది. ఒక్కసారే నిర్ఘాంత పోయాడు.

'పెళ్లికూతురెవరో తెలుసా అన్నయ్యా!' అని సుశి ఎంతో ఆశ్చర్యముతో అంది.

'తెల్యాదమ్మా!' అని ఆనందుడు అసలు సంగతి తెలుసుకోవాలని అన్నాడు.

'నేను చెప్పను' అని సుశి కొంటెగా అంది.

'చెప్పవుగదూ....! నా పెండ్లికి నీకు బహుమతులు తెస్తాగా బుజ్జి గిస్తూ సుశి తల నిమురుతూ ఆనందుడు అన్నాడు.

ఒక్కసారే సుశీ హృదయం ఆనందములో తొణికిసలాడింది. ముఖం పూచిన చెంగల్వ పూవులా కలకలలాడింది. ఇక దాచలేకపోయింది.

'మన విజయ' అంది సుశీ

ఏమిటీ విచిత్రం. నాకు తెలియకుండా పెండ్లి నిశ్చయించారా? అందులో మేనమామ కూతురు విజయను. చిన్నప్పటినుంచి తమ్మునికిస్తామని పేరుపెట్టి అతడు నిరాకరిస్తే నాకా? ఇది న్యాయమేనా? 'చిన్నప్పటి నుంచి తెలివి తక్కువ దద్దమ్మ' అనుకున్నవారు యిప్పుడు నాకు ఇవ్వటానికి ఎలా ఒప్పుకున్నారు. సమాజం ఏమంటుంది? ఒప్పుకుంటుందా? నలుగురు నవ్వుతారు. అమ్మా నాన్న ఎట్లా ఒప్పుకున్నారు. ఇందులో ఏదో రహస్యముంది. తమ్మునికిస్తామన్న పిల్లను అన్న చేసుకోవటం ధర్మమేనా! అడుగుతాను నాన్నను ఇదంతా అడుగుతాను' అని ఆనంద్ మనస్సులో అనుకున్నాడు.

'ఏమిటి అన్నయ్యా! అలావున్నావు? నీకీపెళ్లి యిష్టములేదా? సుశీ అన్నముఖముకేసి చూస్తూ జాలిగా అంది. ఆనందునికి ఏమి సమాధానమియ్యాలో తోచలేదు.

'ఏమిలేదు చెల్లీ! చాలా రాత్రయింది పోయి పండుకో అమ్మా! అని ఆనంద్ అన్నాడు

సుశీ వెళ్లిపోయింది. ఆ పసిపాపకేమి తెలుసు ఆనందుని హృదయములోని ఆవేదన.

రాత్రి రెండు గంటలైంది. నిశ్శబ్దంగా వున్న ఆ వాతావరణంలో ఆనందుని మనస్సులో గడచిన మధుర స్వప్నాలన్నీ మిలమిల మెరసిపోతున్నాయ్. ఆలోచనలతోపాటు ఎన్నో అనుభవాలు గుర్తుకొస్తున్నాయి. కాని తిరిగి ఏదో బాధ....ఏదో ఆవేదన-అతనిచుట్టు కమ్ముకుంటున్నాయి.

'నీ బ్రతుకు పాడుచెయ్యను నిర్మలా!....' అని ఆనందుడు మనస్సులో అనుకొంటున్నాడు. 'నాన్నదగ్గర నిజందాచను. నాకు నీకు ఉన్న ప్రణయ సంబంధం దాచకుండా చెపుతాను. నేను నిన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను.మనిద్దరి అనురాగం నీకు నాకు సుఖాన్నిస్తుంది'

ఆనందుడు ఇదివరకే కాలేజీలో నిర్మలని ప్రేమిస్తున్నాడు. నిర్మల చాలా అందమైనది. ఆమెకూడ బి. ఏ. చదువుతుంది. వారిద్దరికి కాలేజిలోనే మనస్సులు కలిశాయి. ఆనందుడు చాలా తెలివిగలవాడు. సౌందర్యవంతుడు కాకున్నా నల్లగ తీర్చిదిద్దిన అతని కనుబొమలు, విశాలమైన నేత్రాలు, నల్లటి ముంగురులజుట్టు అతనికెంతో వన్నెతెచ్చాయి. నిర్మల కూడ చాలా తెలివి గల యువతి! ఒకప్పుడు ఆనంద్ మరి యొకప్పుడు నిర్మల ఫస్టుగా వుండే వారు. అందువలన వారిద్దరికి కాలేజిలో మనస్సులు కలిశాయి. మరుక్షణ ములో ప్రేమికులయ్యారు.

ఆనందుని మనస్సు కలవరంతో అకులా అల్లాడిపోతుంది. మధ్యమధ్య కోపం సముద్ర తరంగాలుగా పొంగి వస్తోంది. తిరిగి మనస్సు కలత పడి పోతుంది. అతని మనో భావాలు సమాధానము చెప్పుకోటానికి మదనపడు తున్నవి. తిరిగి ఆనందిస్తున్నాడు. తనకు తాను దుఃఖిస్తున్నాడు.

అది సాయంకాలం పశ్చిమ దిశలో సూర్యుడు సాగర గర్భములో పోయాడు. చుట్టుపట్ల నుంచి మల్లెల సువాసనలు మనోహరంగా వీస్తు న్నాయి. నల్లటి నిశాదేవి తెల్లగా మారి పోతుంది. ఆనందుడు నిర్మలకొరకు కాచుకొని వున్నాడు. నిర్మల అనుకున్న సమయానికి యింకా రాలేదు. పబ్లిక గార్డెన్‌లో ప్రేయసీప్రియులు అన్యోన్యంగా ముచ్చటించు కుంటున్నారు.

'క్షమించు ఆనంద్! చాలా ఆలస్యమైంది' ఆనంద్ భుజము పట్టుకొని నిర్మల అంది. ఇద్దరు చిన్నగా జనసంచారము లేనిచోటుకు చేరుకున్నారు. సముద్రములోని కెరటాలు మహా జోరుగా వచ్చి వీరి గాఢాను రాగమునకు అనహ్వాత ప్రకటిస్తు తిరిగి మాయమగు చుండెను.

ఆనందుడు నిర్మలను తన దగ్గరకు తీసుకొని నిర్మలా! నిన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను. అని ఆమెను బలవంతంగా కౌగిటిలో బంధించేశాడు. నిర్మల అతని కండ్లలోకి చూచింది. ప్రేమగా జాలిగా సమా

పాపము కొసరము తొణికిసలాడు తున్నాయ్. అతని శరీరమంతా ఆమెను ఆవరించింది. ఆమె అతనిలో ఒదిగిపోయి మత్తుగా కళ్ళుతెరచి 'నేను కూడ నిన్ను ప్రేమిస్తున్నాను ఆనంద్!' అని నిర్మల అతనిచుట్టు చేతులు పోనిచ్చి గాఢంగా హృదయానికి అదుముకొని అతని కౌగిలిలో కరిగిపోతుంది. వారి ప్రేమ ఒకరినుంచి మరొ యొకరికి ప్రవహిస్తుంది. ఆ వల్లటి వెన్నెలలో ఇద్దరు హృదయాలు కలుసుకున్నాయి.

నీలి నీలి కెరటాలతో సముద్రములో మిలమిల మెరిసి పోతున్న చందమామ వీరి ఆనందమును భరించలేక వెక్కిరిస్తున్నాడు.

'ఏది ఏమైనా నిన్ను తప్ప నే నెవర్ని పెళ్ళి చేసుకోను నిర్మలా!' అని అంటూ ఆమెను ఇంకా గాఢంగా అదుముకొని చెక్కిళ్ళపైన ముద్దులు అనవితర కురుపిస్తున్నాడు. ఆ విధంగా వారి హృదయాలు కలసినవి. ప్రేమ లతలా అల్లుకపోయింది. ప్రతిరోజు వారు అదే స్థలములో కలుసుకుంటూ ప్రేమను సార్థకము చేసుకున్నారు.

ఈ విషయము తలుచుకునేటప్పటికి ఆనందుడు త్రుళ్ళిపడ తాడు. ఈ విషయం తప్ప మరేమి అతనిని బాధించినా బాధలేదు కాని... తిరిగి.... అతనిలో రోదన ధ్వని ప్రతిధ్వనిస్తుంది. గత మధుర బావాలు ఒకటిమి నొకటి వచ్చి పడి మనస్సును శూలంలా బాధిస్తున్నాయ్.

ఆనందుడు దీర్ఘంగా నిర్మలగురించే ఆలోచిస్తున్నాడు. అతని ఆలో చనలు అధికమయ్యాయి. అవి అగ్నిమార్గమే అతనికి కనిపించటములేదు. నాను నాను అతని మనస్సు పూర్తిగా చెడిపోయింది. చివరికి ఏమౌతుందో అని ఆనందుడి హృదయం బాధపడు తుంది. వియుక్తులకు ప్రోత్సాహకరంగా అతని హృదయం పరిణమించింది. ఆశలన్నీ తల్లకిందులైనవి. నిర్మిం చుకున్న గాలి మేడలు తుఫాను వచ్చి పునాదులు లేకుండా కూల్చుకొని పోతున్నాయి. లోకం అతనిముందు అగ్నిలా మండుతుంది. 'ఎందుకీ

భగవంతునికి నామీద కసి....? అష్ట కష్టాలుపడి జీవితము ఏర్పరచుకోక ముందే విడదీస్తావా?' అని ఆనందుడు మనస్సులో అనుకున్నాడు.

ఉదయం ఎనిమిది గంటలయింది. ఆనందుడు నిద్రనుంచి ఆలస్యంగా లేచాడు. లేచిన క్షణమే మనస్సులో రాత్రి విషయం తీవ్రంగా తగులుతోంది.

'నాన్న పిలుస్తున్నాడన్నయ్యా!' అని సుశీ వచ్చి ఆనందుడితో అంది.

'వస్తానని చెప్పు సుశీ!' అని జవాబిచ్చాడు. సుశీ వెళ్ళిపోయింది.

'ఎందుకు పిలుస్తున్నాడు? అడుగటానికి కాబోలు! నిజం చెప్తాను. దాచకుండా చెపుతాను, నాకు ఈ పెళ్లి యిష్టములేదని అంటాను, అని మనస్సులో అనుకుంటున్నాడు.

ధర్మదాసు యీజీ చైరులో కూర్చొని సిగరేటు తాగుతున్నాడు, ఆనంద్ రావటం చూసి

'అలా కూర్చో ఆనంద్! నీతో ముఖ్యవిషయం మాట్లాడాలి.......?' అన్నాడు.

'నాకంతా తెలుసు. నా పెళ్లి విషయం కదూ!' అన్నాడు అదోవిధంగా ఆనంద్.

'అవును....ఆ విషయమే మాట్లాడాలి. నీ పెళ్ళి నిశ్చయించాను. నా మాట కాదనవనే నేను నీకు తెల్పకుండా మాట యిచ్చాను. వాళ్లేమి పరాయివారా? మేనమామ కూతురేగా!' అన్నాడు ధర్మదాసు పొగవదులుతూ

ఆనందుడి హృదయం ఈ మాటలకు బండబారిపోయింది. ఒళ్ళు మండింది. ఎన్నడుకూడ తండ్రి మాటలను వ్యతిరేకించి ఎరుగడు. నేడు సమయమొచ్చింది.

'నాన్నా, నాకీ సంబంధము ఇష్టములేదు. మీ కిప్పుడే చెప్పేస్తున్నా తమ్ముడు వచ్చాంటే నాకు కట్టబెట్టాలని చూస్తున్నారు' అన్నాడు ఆనంద్.

'ఎందుకు జరగదు నాయనా!....విజయ నీ మేనమామ కూతురు.... మన యింటిలో మేనరికం తర తరాలనుంచి సాంప్రదాయంగా వస్తుంది.

దానిని తప్పించటం మన తరమా? తమ్ముడు వద్దంటే నీకు కట్టబెడు తున్నానా! అవును నిజం....వాడు నామాట వినలేదు. అయినా! నీవు యింటికి పెద్దవాడవు. నిన్ను కాదని వాడికెట్లు యిస్తారు....?' అన్నాడు ధర్మదాసు.

'అవి వెనుకటి సంప్రదాయాలు. నేటి కాలములో అలా జరగటానికి వీలు లేదు. నాన్న, మీరు ఎన్ని చెప్పండి నేను విజయను చేసుకోను' అని ఆనందుడు తన హృదయములో రేగుతున్న క్రోధాగ్నిని అణుచుకోలేక పోయాడు!

'ఎందుకు? ఏమిటా కారణం?' అని ధర్మదాసు అన్నాడు. మేనరికాన్ని కాలదన్ని కూడదని మీనిశ్చయము కాబోలు. మీ నిశ్చయాన్ని నేను కాదనను ఎన్నడులేని అనురాగము వాళ్ళకు నేడు నా మీద ఎందుకు కలిగింది.నన్ను చపల చిత్తునిగా భావించారు గదా! నిజంగా వాళ్ళు అనుకునేటటువంటి చపలచిత్తుడిని కాను. వాళ్ళు లోకానికి వెరచి మాత్రమే నాకు ఇవ్వటానికి నిశ్చయించారు. నాన్న, మీరు నిజం తెలుసుకొండి అన్నాడు ఆనంద్ కోపంతో

'ఇది జరిగి తీరవలసిందే! ముమ్మాటికి జరగవలసిందే! ఆరు నూరు కాని నూరు ఆరు కాని ఈపెండ్లి తప్పక జరిగి తీరవలసిందే సమాజం మనల వెక్కిరిస్తుంది. నీవు బాగా తెలిసిన వాడవు. ఇన్నాళ్ళు పెంచి పెద్ద చేసి నందుకు మా పరువు మర్యాదలు దక్కించు, జరగవలసిందే! కాని తప్పి పోవటానికి వీలులేదు' ధర్మదాసు పట్టరాని కోపముతో అన్నాడు.

ఆనందుడు తండ్రికేసి చూశాడు. తండ్రి రెండు కళ్ళలో ఎర్రటి నిప్పులు కణకణ మండుతున్నాయ్!ఆనందు ఇక ఏమి మాట్లాడలేకపోయాడు.

వైశాఖమాసం రానే వచ్చింది. పెళ్ళింకా వారంరోజులున్నా యింట్లో హడావిడిగా వుంది. పెళ్ళి ప్రయత్నాలు మహాజోరుగా సాగుతున్నవి, బంధు వులందరికి పోయావి పత్రికలు. నిర్మలకు కూడ పోయింది పిలుపు.

ఆనందుడు ఉదయం కాఫీ తాగుతూ టప్పా చూసుకునేవరకల్లా ఎక్కడి నుంచో పెళ్ళి పత్రిక వచ్చింది—దానిని తీసి చూసేవరకు ఆనందుడు వులిక్కి పడ్డాడు. అతనికి ఆ క్షణంలో వూపిరి సలుపలేదు. నిర్మలైన నీట్లూ ర్ను ఎడచాడు 'నిర్మలను....భాస్కర్‌రావు పెళ్ళి....?' అని వుంది. అతని తల గిఱ్ఱున తిరిగి పోయింది. క్షణంలో మళ్ళీ ఆనందుని హృదయం ఉల్లా సంగా మారింది. అతని మనస్సు మనము తెలుసుకోలేము. క్షణంలో సము ద్రములా పొంగుతుంది. మరు క్షణంలోనే కృంగి పోతుంది. పాఠక లోకా నికి అర్థముకాదు. ఆనందుని మనస్సులోని మర్మం. తిరిగి అతనిలో ఏదో తీరని అశాంతి ప్రజ్వరిల్లింది. మరుక్షణం అతనిలో ఉన్న చిరాకు,బాధల్ని పాగొట్టి మనస్సును ఆనంద పర్చటానికి ఆత్మ ప్రయత్నిస్తుంది.

'నిర్మల ఈ పెళ్ళి చేసుకోటానికి సిద్ధపడిందా? ఎట్లు నమ్మడము? తను చేసుకోనందుకు కోపము వచ్చిందా? నిర్మల ఏవిధంగా బాధపడుతుందో!' అని ఆనందుడు మనస్సులో అనుకున్నాడు.

అకస్మాత్తుగా బాజా బజంత్రీలు అతని మనస్సులో మెదిలాయి.అసలు ఈ పెళ్ళి చేసుకొని ఆనందుడు ఏమి సుఖపడుతాడు? నిర్మల లేనిది బ్రతుక గలడా? అయితే, ఇప్పుడేమి చేయుటం? అది ఒక్కటే మార్గం ఆత్మహత్య చేసుకోవటమే!' తను ఈ లోకమునుంచి దూరమైతేనే మంచిదని నిశ్చ యించుకున్నాడు.

పగలంతా ఈ విధంగా ఆలోచించుకుంటు ఎక్కడెక్కడో తిరిగాడు మనస్సుకు స్థిమితము లేకపోయింది. మనస్సు తీరని బాధతో మధనపడు తుంది. అతనికితోడు ప్రకృతి కూడ సహాయ్యపడింది. హోరుమన గాలి వీస్తుంది. ఆనందునికి అకస్మాత్తుగా ఏదో ఆలోచన తట్టింది. ఏదో వ్రాస్తున్నాడు. బయట వర్షం విధి విరామం లేక యితనికి చిరాకు కలిగిస్తున్నది.

'ప్రియమైన నిర్మలకు'

అభాగ్యుడైన ఆనంద్ వ్రాయునది ఏమనగా నేను నీకు తీరని ద్రోహం చేశాను. ఇంటికి వచ్చే వరకు పరిస్థితులు మారిపోయినవి. మనస్సు చెడి

పోయింది. మా నాన్నకు ఎంతగానో చెప్పాను. కాని వినలేదు. విధిలేక ఒప్పుకోవలసి వచ్చింది. నాకీ పెళ్ళి ఏమాత్రం ఇష్టములేదు. భగవంతుడు నాకు చక్కటి మేలు కొలుపు చూపించాడు. ఇక నన్ను మరచిపో. నీవు పంపిన పెండ్లి పత్రిక ముట్టింది. నేను అక్కడికి ఏమోక్షము పెట్టుకొని రావాలి. నేను నీ పెండ్లికి చాలా ఆనందించుచున్నాను. హృదయపూర్వకంగా నా శుభాకాంక్షలందుకో 'సర్వేశ్వరుని అనుగ్రహమువలన మీ దాంపత్యము పదికాలాలపాటు చక్కగా వర్ధిల్లుగాక! నన్ను మృత్యువు ఆహ్వానిస్తుంది హృదయపూర్వకంగా స్వీకరిస్తున్నాను. తీరికగా వుంది....?

ఇట్లు,
ఆనంద్.

ఆనందుడు ఉత్తరము తీసుకొని బయలుదేరాడు. దారిలో ఆ ఉత్తరమును టప్పాలో వేశాడు. ఊరికి ఉత్తరదిశగా బయలుదేరాడు ఊరిక ఉత్తరమున గంగానది ప్రవహించుచుంది.అర్ధరాత్రి కావస్తోంది. ఆకాశంకూడ, మబ్బుమబ్బుగా ఉంది. ఆనందుడు నెమ్మదిగా ముందుకు పోతున్నాడు. అతడు గంగానది చేరుకునేవరకు గాలి హోరుకూడ ఎక్కువయింది. మళ్లి వర్షం ప్రారంభమయింది.వర్షముతోపాటు ఉరుములు మెరుములు కూడ ప్రారంభమయ్యావి. నదిలోని వరదలు అలలుగా వచ్చి ఆనందునికి స్వాగతమిస్తున్నాయి ఆనందుడు....నదిలో........ప్రవేశించాడు.

తెల్లవారింది. సూర్యుడు నెమ్మదిగా పైకి వస్తున్నాడు రాత్రి నదిలో ప్రయాణము చేస్తున్ననావలోనియిద్దరు బాటసారులుఆనందుని రక్షించిహాస్పటల్‌లో చేర్చారు.

హస్పటల్లో ఒక గదియందు స్పృహతప్పివది ఉన్న ఆనందుని డాక్టర్ చూచి ఆశ్చర్యపోయాడు.గబగబా దగ్గరకు వెళ్లి ఆనందుని పరీకించి జరిగిన విషయమంతా తెలుసుకున్నాడు.

'ఎంతపని చేశావు అన్నయ్యా!'అని డాక్టరు బాధతో నుదిటిమీద కొట్టుకొన్నాడు. ఎవరో డాక్టర్‌కాదు ఆనందునితమ్ముడే! డాక్టర్ జరిగిన వంగ

తంతా తెలుపుతు ఇంటిక బెలిగ్రాం ఇచ్చాడు. ఆనందుని అపాయస్థితి నుండి రక్షించటానికి డాక్టర్ శాయశక్తులా కృషిచేశాడు.

సాయంత్రం అయ్యేముందు ఆనందునికి స్పృహవచ్చింది....ఐలహీనంగా కనురెప్ప తెరచి చూసేవరకు నిర్మల తనదగ్గరేవుంది. 'నిర్మల.... నిన్ను.... మోసము.... చేశాను.... నన్ను క్షమించు....' అని ఆనంద్ నిర్మలకేసి చూస్తూ జాలిగా అన్నాడు.

నిర్మలపెళ్లి చెడిపోయింది. భాస్కర్‌రావు నిర్మలను చేసుకోవటాని కిష్టములేక ఎటో పారిపోయాడు. ఆనందుడి ఉత్తరము చూసుకొని ఇక్కడికి చేరుకుంది?

హాస్పిటల్‌లో ఆనందుకు తండ్రీ, తల్లి, సుశి, జగదీశ్, మేనమామ, విజయ, నిర్మలతండ్రి, తల్లీ అందరు కనిపించారు. వారి నందరిని చూసేవరకు ఆనందుడి హృదయం అవమానముతో కృంగిపోయింది. తండ్రికేసి చూస్తూ 'నన్ను క్షమించు నాన్న!' అని మాత్రము అన్నాడు. ధర్మదాసు కొడుకు స్థితి చూసి నిలువున నీరైపోయాడు.

'క్షమించు ఆనంద్! నావల్లనే యిదంతా జరిగింది....ఇష్టములేనిపెళ్లి ఏస్థితికి వస్తుందో ఈ నాడు తెలుసుకున్నాను' అని ఆనంద్ కన్నీరు తుడుస్తూ దర్మదాసు అన్నాడు.

'ఈ తప్పంతా నావే అన్నయ్యా! నేను విజయను చేసుకోనని నిరాకరించటమే....కారణం....! మా అన్నయ్య మనశ్శాంతి కొరకు నేను విజయను తప్పక పెళ్లిచేసుకుంటాను' అని డాక్టర్ స్పష్టముగా పలికెను.

ఈ మాట వినగానే ఆనందుని హృదయం వికసించినది.

'క్షమించు ఆనంద్! ఈ తప్పంతా మాదే!' ఆనందును మేనమామ ప్రతిమాలుకున్నాడు.

'మమ్ములను కూడ క్షమించండి! కూతురు అభిప్రాయం తెలుసుకోక పెళ్లి నిశ్చయించటమే మాకు తీరని అవమానం జరిగింది, అని నిర్మల తండ్రి నవ్వుతూ అన్నాడు. అందరు ఒక్కసారే నవ్వారు. ఆనందుడికి కూడా నవ్వొచ్చింది.

సమాప్తం.

# కలిసిరాని ప్రేమ

---

రవి అప్పుడే కాలేజీనుంచి వచ్చి, వరండాలో కుర్చీలో కూర్చుని ఏదో ఆలోచనలో మునిగిపోయాడు. సూర్యనారాయణమూర్తి అప్పుడే తన లేత బంగారు కిరణాల్ని చాలించి మరో ప్రపంచంలోకి పోతూ, సాయంత్రం సుమా అని హెచ్చరిస్తున్నాడు. అన్ని ప్రాణులు అతని ఆజ్ఞను పాటించు తున్నాయి. పక్షులు కిలకిల కేరింతలతో తమ, తమ నివాసాలకు చేరుకుంటు న్నాయి. తూర్పు ఆకాశంలోంచి పూర్ణిమనాటి చంద్రుడు అప్పుడే నిద్రనుంచి మేల్కొని తన వెలుగును ప్రపంచంమీదికి ప్రసరింప జేస్తున్నాడు. ప్రకృతి అతని వడిలో హాయిగా నిద్రపోవటానికి ప్రయత్నిస్తుంది. ఆ నీలాకాశంలో మిల మిల మెరిసిపోతున్న చందమామ చుట్టు నక్షత్రాలు ఉల్లాసంగా మిణుకు మిణుకుమని మిణుగురు పురుగులవలె తళుక్కు తళుక్కు మని మెరిసి అదృశ్యమౌతున్నవి. మానవుడు కూడ ఈ ప్రపంచంలో కొన్నాళ్లు మిణుగురు పురుగలవలెనే తళుక్కుమని మెరిసి అదృశ్యమౌతున్నాడుగదా!

"మానవుడు ఈ ప్రపంచంలో జన్మిస్తున్నాడు, జీవించు తున్నాడు. సౌఖ్యం కోసరము, స్వార్థంకోసరము మానవుడు చిత్ర విచిత్రమైన వేషాలు ధరిస్తాడు. తానేపాత్ర ధరిస్తున్నాడో అతనికే తెలియదు. తానెటు పోవాలో యేమి చేయాలో, తన కర్తవ్యమేమిటో ఎవరికికూడా తెలియదు. ఎందుకు జన్మించాను......? ఎట్లా జీవించాను........? ఈ రెండింటిలో యేది యెందుకో యెరుగడు. ఇదంతాతెలుసుకోవటానికైనా ప్రయత్నించడు. అలా ప్రయత్నించక పూర్వమే మృత్యువాసన్న మౌతుంది, అని రవి తనలో తను ఆలోచించు కుంటున్నాడు;

ఇంతలో "బావా!" అంటూ తలుపు తెసుకొని సరోజ వచ్చింది. ఇంట్లోని గడియారం అప్పుడే టంగ్ టంగ్ మని పిదు గంటలు కొట్టింది. ఆ చప్పుడు రవి ఆలోచనలకు తీవ్ర విఘాతం కలిగింది. ఆ గడియారం చప్పుడేగాక ఆ కోమలి తీయని కంఠం కూడా అతని చెవుల్లో బడింది. రవి చటుక్కున వెనకకు తిరిగి చూశాడు.

" ఎవరూ ? అని రవి కుర్చీలోనుంచి లేచి ఆశ్చర్యంగా సరోజా ! నీవా !! రా అలాకూర్చో ! " అన్నాడు.

" అత్తయ్యా, కమల ఏరి........? " అంది సరోజ కుర్చీలోకూర్చుని.

" ఏం ! వాళ్లేకావాలా ? నేనవసరములేదా ? " అన్నాడు రవి చిలిపిగా నవ్వుకుంటూ.

" పోబావా ! నీవెప్పుడింతే....? " అని సరోజ కోపంతో లేచి నిలబడి పోయింది.

ఆకోపానికి ఆమె చెక్కిళ్లు ఎర్రబడి పోయాయి.

రవి ఆమె భావాన్ని గ్రహించి దగ్గరగావెళ్లి " నేనంటే నీకెందుకంత కోపము సరోజా ! "

ఇద్దరూ కొన్ని క్షణాలు మెదలకుండా వూరుకున్నారు. రవి అలామాట్లాడటంతోటే సరోజ హృదయం జాలితో వికసించింది. ఆమె ముఖం సిగ్గుతో ముడుచుకొని పోయింది.

" నేను నిన్నేమి దురుద్దేశంతో అనలేదు సరోజా ! అన్నాడు రవి.

" పోండి....మీరిలా వేళా కోళాలాడితే బాగుండదు " అంది సరోజ.

" సరేకాని బావా ! ఇంతకి అత్తయ్యా, కమల ఎటుపోయారు ? " తిరిగి అంది.

" లేరు సరోజ ! అంతా సినిమాకి వెళ్ళారు. సాగరలో ఈరోజు కొత్త పిక్చరుగా ! వస్తుందో, వస్తుపో........అందులో కొత్తపిక్చరుసుమా కమల చూడకుండా వూరుకుంటుందా ? " అన్నాడు.

" అయితే అంతా సినిమాకి వెళ్ళారన్నమాట ! బావా నీవెందుకు పోలేదు ? " అంది.

"కాలేజీనుంచి వచ్చేవరకు అరగంటైంది. అంతా సినిమాకుపోతే ఇంట్లో ఎవరుంటారు? తిరిగా మరొకసారి ఎప్పుడైనా చూడామనుకున్నాను. అంతే—సరోజా! అన్నాడు రవి.

"బావా! ని కెమిస్ట్రి నోట్సుబుక్కు కొద్దిగా దయజేస్తావా? అంది సరోజ.

"అయితే! సరోజా! నీవు ఈరోజు కాలేజీకి ఎందుకు రాలేదు."

"నేను రానిది తమరికి ఇప్పుడు జ్ఞాపకమొచ్చిందా? నన్ను మరచి పోయారన్నమాట!" అంది సరోజ నవ్వుతూ.

"లేను జ్ఞాపకానికివస్తే అడుగుతున్నాను. నాకు తెలుసుండి అడ్గుటం లేదు. నిజంగా నాకు తెలియదు సరోజా!" రవి జాలిగా

"పోనీలే—ఇక మీ నోట్సు ఇలా పడేయండి పోతాను" అంది కటువుగా

రవికి ఆమె ప్రవర్తన ఏటువంటిది అర్థంకావటంలేదు. రవి ఆమెవైపు తీక్షణంగా వోమారు చూశాడు. ఆ విద్యుద్దీపపు కాంతిలో ఆమె మొహం తళ తళ మెరిసిపోతుంది.

"ఇదిగో నోట్సు పుస్తకం" అన్నాడు రవి. సరోజ పుస్తకం తీసుకొని

"ఇక నేను పోతాను బావా! అత్తయ్యవస్తే అమ్మ రమ్మన్నదని చెప్పు. వర్షం వచ్చేటట్టుంది. త్వరగా పోతాను"

సరోజ వెళ్లిపోయింది. అనుకోకుండా వచ్చింది. హఠాత్తుగా వెళ్లి పోయింది. ఆమె వెళ్ళిపోయాక పాపం! రవి మెల్లగా ఆమె అడుగులకేసి చూశాడు. ఆమె వెళ్ళిపోతూ వో చిన్ననవ్వు నవ్వింది. ఆనవ్వుతో ఆమె మొఖములో ఒక విధమయిన నూతనకాంతి వెలిగింది. యౌవనంతో కళ కళ లాడుతున్న ఆమె సౌందర్యం మినమిన లాడుతుంది. సరోజనలో ఒక గొప్ప ఆకర్షణశక్తి వున్నది. ఆమె ఒక్కనవ్వు కిలకిలమని నవ్విందంటే యెటువంటి వాళ్ళనయినా అయస్కాంతంలా ఆకర్షించేశక్తి ఆమెలో ఉంది. ఆమె సౌందర్య మహత్తంతా ఆమె కళ్ళల్లోనే వుందని ఆమెను చూచినవారు అనుకోక

మానరు. ఆమెకు సుమారు పద్దెనిమిది యేళ్ళుంటాయి. ఈమె ఎవరోకాదు రవి మేనమామ కూతురు. ఒక శ్రీమంతుల యింటి బిడ్డ. ఆమె ఒక కలవారి ఇంటి బిడ్డయని ఆమెను చూస్తేనే తెలుస్తుంది. ఆమె మొహం ఎప్పుడూ నిగనిగ లాడుతూ చిరునవ్వులతో ద్యోతకమవుతుంది. ఒక్క మాటలో చెప్పాలంటే సరోజలాంటి సౌందర్య యువతులు ఈ లోకంలో చాలా అరుదని చెప్పవచ్చు. సరోజ తెల్లటిచీర కట్టుకొని, తలలో పువ్వులు పెట్టుకొని వుంటే అచ్చంగా ఆకాశంలోనుంచి భూలోకరంభ దిగి వచ్చిందేమోనని భ్రమపడవలసి వస్తుంది.

"జీవితంలో సరోజ ఏనాటికైనా నా అర్ధాంగి కాగలవని చెప్పగలను సరోజ నాకు లభిస్తే ఆమె యౌవన సౌందర్యాన్ని లోకానికి ఆదర్శంగా చూపుతూ సగర్వంగా చెప్పుకుంటాను" రవి ఈ విధంగా సరోజ అందచందాలు మదిలో చిత్రించుకుంటూ ఆలోచనల్లో మునిగిపోయాడు.

ఇవాళ్ళ సరోజ ప్రవర్తన రవికి మరీ ఆశ్చర్యం కలుగుతుంది. ఆమె కొద్ది విషయానికే ఎందుకలా కోపానికి వస్తుంది? అయితే మరు క్షణంలోనే ఆమె కోపం పూర్తిగా చల్లారి, ఆమె నయనాలు సంపూర్ణ వికాసం చెంది ఆనందాన్ని ఎందుకు వెదజిమ్ముతాయి? తియ్యటి మాటలతో ఎందుకలా నవ్విస్తుంది. అయితే, సరోజకు తనంటే ఇష్టం లేదా? ఇష్టంలేకుంటే కోపం చల్లారిన తర్వాత ఎందుకలా మాట్లాడుతుంది? చలోక్తిగా ఎందుకు అలా పరిహాసమాడుతుంది? అయితే, ఇంతకి కారణమేమిటి? ఆమెకు నాలో స్థానములేదా? సరోజ నన్ను ప్రేమించటంలేదా? ఆమె యింకెవరినైనా ప్రేమిస్తుందేమో?' ఇలాంటివన్నీ రవి లోలోపల అనుకుంటూ బాధపడుతున్నాడు.

కొందరికి తమ గొప్పతనం చాటడంలో ఇతరుల్ని చిన్న బుచ్చటం, వాళ్లని మాటలలోనే కట్టివేయటం అలవాటు. సరోజ కూడ ఇలాంటి అభిప్రాయాలు కలదే. ఈ ప్రపంచంలో తనికి తెలియని విషయాలు లేనేలేవని సరోజ ప్రగాఢ విశ్వాసం తనలాంటి సౌందర్యవంతులు ఈ లోకంలో లేరని మురిసిపోతూ తనంతకు తానే సంబరపడి పోయింది.

సరోజ ఒక ఆనందం లో నేకాదు, చదువులోకూడ చాలా తెలివైనది. రవి, ఆమె ఇద్దరు క్లాస్‌మేట్స్ బి. యస్. సి చదువుతున్నారు. ప్రతి సబ్జెక్టులో ఇద్దరికీ పోటీ. ఫస్టు, సెకండు మార్కులు వారిద్దరే పంచుకుంటారు.

సరోజ తండ్రి పెద్ద లక్షాధికారి. పేరు రాఘవయ్య. ఆయనకు ఇద్దరు కొడుకులు. వారిద్దరి తర్వాత సరోజయే ఆయన ముద్దు ముద్దుల కూతురు. రాఘవయ్య సరోజను చిన్నప్పటినుంచి అతిగారాబంగా పెంచుతూవచ్చాడు. అందునుంచే ఆమెకు అలాంటి పెంకి తనము అలవడిపోయింది. రాఘవయ్య పెద్దకొడుకు ఎమ్. ఎ. ప్యాసయి నిజాం కళాశాలలో లెక్చరర్‌గా చేరాడు. ఇక చిన్నవాడు ఎమ్. యస్. సి. చదువుతున్నాడు. రాఘవయ్య ధనవంతుడైనప్పటికి అతనిలో అహంకారం మాత్రము లేదు. అలాంటి మంచి గుణగణాలు వుండబట్టే ఆయనకు సంపద లభించిందని అందరు అనుకుంటారు. అలా అనుకోవటంలో ఎంతవరకు నిజమో అంతా ఊహించుకోవలసిందే! అతని సంపాదనతోటే అతని చెల్లెలు కుటుంబం కూడ బ్రతుకుతుంది. అదీగాక ముందు ముందు వాళ్ళ పెళ్ళిళ్ళ సంగతికూడా అతడే చూడాలి!

రవి ఆవిధంగానే ఏదో ఆలోచించుకుంటూ వాలుడు కుర్చీలో పండుకున్నాడు. అతనికి షుమారు ఇరవై అయిదు సంవత్సరాలుంటాయి. మంచి ఆజానుబాహుడు, అతియుక్తి పరుడు. మిలమిల మెరిసే కండ్లతో, చామన చాయతో కళకళలాడుతూ వుంటాడు. ఇంతలో తల్లి—చెల్లెలు వచ్చారు. వారు వచ్చేసరికి ఆలోచిస్తున్న రవి ఒక్కసారే కుర్చీలోనుంచి లేచాడు.

'సినిమా యెలావుంది?' భోజనంచేస్తూ చెల్లెల్ని అడిగాడు.

'బేషుగ్గా వుంది అన్నయ్యా!' అంది కమల

రవి తల్లి పేరు రామేశ్వరమ్మ. ఆమెకు నలభై యేళ్ళుంటాయి. భర్త చనిపోవడంతోనే, రామేశ్వరమ్మ పదియేళ్ల రవితో, మరియు ఒక సంవత్సరము కూతురు కమలతో అన్నవద్ద కొచ్చి కాలం వెళ్ళమారుస్తున్నది. రాఘవయ్య ఇంటికి ప్రక్కనే యున్న అతని ఇంట్లోనే వుంటున్నారు. రామేశ్వ

రమ్మకు పాలివారు ఎవ్వరులేరు. కాబట్టి తన పిల్లలతో ఆ గ్రామములో ఒంటరిగా వుండబట్టలేక తనఆస్తియొక్క చిరాస్థులన్నిటిని అమ్ముకొని, తన అన్న దగ్గరకు వచ్చి, తన పిల్లలను తెలివిగలవారిని చేసుకుంది. భర్త చనిపోయా తన్న విచారాన్ని వదలి ధైర్యంగా, కష్టాలను ఎదుర్కొన్నది. రాఘవయ్య మంచితనము వల్లనే వారి కుటుంబం 'నిత్యకళ్యాణం పచ్చతోరణం' వలె నిత్యమూ, కళకళలాడుతూ ప్రకాశిస్తూ వచ్చింది. ఇంట్లో ఎవరికి ఏ భేదాభిప్రాయాలు లేవు. ఇంతవరకు కలిగించేటంతటి పరిస్థితికూడ రాలేదు. తన అపురూప సౌందర్యవతయిన ముద్దుల కూతురు సరోజను ఏవిధంగా నైనా, తన మేనల్లుడయిన రవికి యివ్వాలని అతని తలంపు. అందుచేంచే రాఘవయ్య వారిని ఆదరించి ఆశ్రయమిచ్చాడని లోకం అంటుంది. ఈ మాటలలో ఎంత వరకు నిజమున్నదో నేను మాత్రము చెప్పను, లోకం అను కుంటుందని కూడా నేను కలముతో వ్రాయలేను. ఇగ రామేశ్వరమ్మకు కూడ అట్టి తలంపే! సరోజను ఏవిధంగానైనా తన ఇంటి కోడలిగా చేసుకుంటే తనకు ఇక జన్మలో కావలసిందేముంది. దిక్కులేని తనకు తన అన్నయే సర్వస్వము అని తలుచుకున్నది.

భోజనాలయిపోయిన తర్వాత రవి తనగదిలో పండుకున్నాడు. పండు కున్నాడే గాని నిద్ర సరిగా రావటంలేదు ఏవో ఆలోచనలు అతని మనస్సును తీవ్రంగా వేధిస్తున్నాయి.

అబ్బాయి, రవి! ఇంకా పండుకోలేదేమిరా? నిద్రరావటములేదా? అయితే! నిద్రరాకుంటె, చదువుకోకుండా ఎందుకలా ఆలోచించుకుంటూ మనస్సును పాడుచేసుకుంటావు!' అని మరల తిరిగి వెంబడే 'నాయనా!' అంది రామేశ్వరమ్మ రవితో.

'ఏమిటమ్మ!' అన్నాడు రవి

కమల పెళ్లి విషయంరా! ఇంకెంత కాలం అది మన ఇంట్లో వుం టుంది. ఎదిగిన ఆడపిల్ల ఇంట్లో పెళ్లికాకుండా వుంటె ఇంటికి చేటురా?

ఇలాగే ప్రంటె నలుగురు నవ్వుతారు. కమల పెళ్లి అయిపోతే, మన బరువు పూర్తిగా తగ్గిపోతుందిరా? నీవు రోజు నలుగురిలో తిరుగుతుంటావు. చాలా మంది తెలిసే ఉంటారు. ఎవరైనా, నీకు నచ్చినచో మంచి సంబంధము మన కమలకు ప్రయత్నించు నాయనా!' అంది రామేశ్వరమ్మ.

'నలుగురి సంగతి మన కెందుకమ్మా! కమలను అప్పుడే చదువుమాని పించి ఒకరిచేతిలో పెడితె ఎట్లా? దానికి ఇంకా పదునైదు సంవత్సరాలయినా నిండలేదు. దానిని కూడ బి. ఎ. వరకు చదివించి పెళ్లి చేస్తే చాలా బాగుం టుంది. ఎందుకమ్మ నీకంత తొందర. లోకానికి భయపడి దాని అదృష్టాన్ని మంటకలిపితే ఎట్లా? అన్నాడు.

'నీకు తెలియదా నాయనా! ఈ లోకం కరుడు గట్టిన అజ్ఞానంతో స్వార్థాన్ని కప్పుకొని వుంది. కాని నిర్దుష్టంగా ఆలోచించే శక్తి లోకానికిలేదు. ఒకరు కష్టపడి నాలుగు రాళ్ళు సంపాదించుకుంటూ, సుఖంగా బ్రతుకు తుంటె ఈ లోకం సహించదు. చీకట్లో ఎవరి గొంతులు కొయ్యాటమా అని వెతుక్కుంటూ వెళ్ళుతుంది. అవినీతితో నిండిన ఈలోకంలో మంచిని ఎవరు మెచ్చరు. ఈ ప్రపంచమే ఒక ఎండ మావుల ప్రదేశం. ఈ ప్రదేశంలో ఎటు చూసినా ధగధగమని మండె మంటలే. ఈ మంటలు కోరలు సాచి, నీతి నియమాలు అనేవి ఆలోచించకుండానే, ప్రక్కలనున్నవారిని కాటు వేయ టానికి చూస్తున్నాయి.' అంది రామేశ్వరమ్మ.

లోకానికి భయపడి మన అభిప్రాయాలూ, ఆశయాలూ, ఆవేశాలు అణుచుకొని పూరుకుంటే ఏలా? అమ్మా!' అన్నాడు రవి ప్రశ్నార్థకంగా.

'అవును నాయనా! ఆలా అణుచు కుంటెనే ఈ ప్రపంచంలో కొన్నాళ్లు సుఖంగా బ్రతుకుతాం, ఇప్పుడు మన ఆశయాలకు, అభిప్రాయాలకు అను కూలంగా తీసుకొని కమలను ఆవిధంగానే ఇంకా కొన్నాళ్ళుఉంచితే మనము నలుగురిలో తలెత్తుక తిరుగలేము. సమాజం మనల ఆడిపోస్తూ, వెలివేసి సంఘం నుంచి బహిష్కరించి, మనపైన అనవసరమయిన అపనిందలు మోపుతుంది. ఈ సమాజానికి నీతి నియమాలు లేవు. నీవు బాగా ఈ సమా

జాన్ని గురించి ఆలోచించు. దీనిలో జరిగెఅవినీతిని అవలీలగా అర్థంచేసుకో గలవు. ఈ సమాజం మానవుణ్ణి వెనక్కు పోతుంటె సహించుతుంది. కాని ముచ్చటగా అభివృద్ధి చెందుకుంటూ ముందుకు పోతుంటె మూగిలా పూరు కోలేదు అంది రామేశ్వరమ్మ.

'ఇలా మన కమల కొఱకే భయపడుతుంటె—ఈ లోకంలో దానికంటె' పెద్దవాళ్ళు యెంతమంది లేరు? అన్నాడు రవి మెల్లగా.

'అవును లేకపోలేదు. కులవంశాలెంత విహీనమైనానరే చేతినిండా డబ్బుంటెచాలు, సమాజ నియమాలను అరచేతి గుప్పెట్లో అట్టెపట్టి ఉంచ వచ్చు. సమాజ స్వరూపాలు మార్చేశక్తి డబ్బులోనే ఉంటుంది. నేననుకుం టాను చాలామట్టుకు ఇలాంటివారి ఇంట్లల్లోనె ఉంటారు. అసలు సమాజ సంస్కర్తలే వారైనపుడు ఎవరేమి చేస్తారు. 'గ్రామపతి తగుతప్పితె గ్రామ ములో నున్నవారు కాదనగలరా!' అన్నే విషయం నీకు జ్ఞాపకంలేదా?' అంది.

'రెక్కలు ముక్కలు చేసుకొని శ్రమపడే ఈ శ్రమజీవులకేనా సమాజ నియమాలు? అహొరాత్రులు కష్టపడి, ఆకలిమంటతో పస్తులుపడి ఈ భాగ్యవంతులకు సర్వ సౌఖ్యాలు చేకూర్చుతుండే ఈ శ్రమ జీవులకొఱకేనా ఈ సమాజాలు ఎందుకమ్మా? వాళ్ళకు సమాజంలో బ్రతుకటానికి అర్హత లేదు. ఎందుకో ఈ హెచ్చుతగ్గులు నాకర్థంకాదు.' అని రవి తల్లిని ఆశ్చ ర్యంగా అడిగాడు.

'ఈ సమాజంలో నిరుపేదలకు స్థానములేదు. వారుచేసిన తప్పులను కూడ సరిదిద్దలేరు నాయనా!. చేసిన తప్పుకు శిక్ష అనుభవించవలసిందే! క్షమాపణ మాత్రములేదు.' అంది.

'అయితే! నీవు ఎందుకలా భయపడుతావు. మామయ్యా వుండగా మన కెందుకమ్మా ఈ భయం' రవి తల్లితో ప్రాథేయ పూర్వకంగా అన్నాడు.

'అలాగని మంది మీద భారమేసుకొని కూర్చుంటె యెలా? దీపముండ గానే ఇల్లు చక్కబెట్టుకోవాలి. ఎక్కడన్నా నీవు కూడ ప్రయత్నించి చూడు

నాయనా! దానికి మూడు ముళ్లు పడ్డతర్వాతనే నామనస్సుకు శాంతి ఉం టుంది' అంది రామేశ్వరమ్మ.

సరే! అలాగే ప్రయత్నిస్తానమ్మా!' అన్నాడు.

'నీవు దానికి ఈ మహోపకారం చేసి పెట్టుకోనాయనా! నీకు పుణ్య ముంటుంది' అంది.

'అలాగే నమ్మా!' అని మరల వెంటనే ఏదో జ్ఞాపకం తెచ్చుకొని 'అరె... ! నేను మరిచేపోయాను. ఇంతకు ముందే సరోజ నీకోసరము వచ్చిం దమ్మా!' అని ఆశ్చర్యంగా అన్నాడు.

'మన సరోజ వచ్చిపోయిందా! ఎందుకూ? అయితే, అప్పటినుంచి ఈ విషయం నాకెందుకు చెప్పలేదు?' అంది.

'మరచిపోయాను కాని....అత్తయ్యా నిన్నుఒకసారివచ్చిపొమ్మన్నదట!'

'నీకెప్పుడు ఈలాగే మతిమరుపైతే, ఇక సంసార మేలా జేస్తావో నాకు తెలకదు. అసలు నీవు ఇలా తెలవితక్కువ దద్దమ్మగా ప్రవర్తిస్తె సరోజ. నిన్నెలా చేసుకుంటుందిరా!' అంది రామేశ్వరమ్మ నవ్వుకుంటూ.

రామేశ్వరమ్మ రవి గదినుంచి వెళ్లిపోయింది. తల్లి చివరిమాటలు విన్న రవి తనలో తను నవ్వుకున్నాడు. ఎందుకు నవ్వాడో అర్థంకాలేదు. కాని అతని నవ్వులో మాత్రము ఏదో అసహ్యత ప్రకటితమౌతున్నది.

బయట ఆకాశంలో మేఘాలు భయంకరంగా గర్జిస్తున్నాయి. హోరున గాలి వీస్తుంది. ఆగాలికి కిటికీ తలుపులు దబదబ కొట్టుకుంటున్నాయి. ప్రకృతంతా ఇలా భీకర స్వరూపంతో జుట్టు విరియబోసుకుని పిశాచంలా తయ్యారై నాట్యం చేస్తుంది. మధ్య మధ్య ఆకాశంలో విద్యుత్తుతో వేడెక్కి తెగిపోయిన తీగలా మెరుపు మెరుస్తోంది. ఆ భయంకర వాతావరణములో రవికి నిద్ర రావటములేదు. గదిలో టేబిలు ముందు కూర్చొని ఏదో దీర్ఘంగా ఆలోచించుకుంటున్నాడు.

'అర్థంకాదు. ఈ మానవ జన్మ-ఈ జ్యోతి ఏక్షణంలో అదృశ్యమై పోతుందో ఎవరికీ అర్థంకాదు. దీపాన్ని నోటితో ఉఫ్ మంటె చల్లారిపోతుంది.

మన ప్రాణంకూడ అలాంటిదే! ఇది ఏ క్షణాన గాలిలో కలసి అదృశ్యమై పోతుందో చెప్పలేము? మానవుడు ఇదంతా తెలుసుకొని కూడ ఎందుకిలా అజాగ్రత్తగా ఉంటాడు. తన స్వార్థం కొఱకు ఎంతటి పాపానికైనా వెనుదీయడు. ఒంటిమెడతో నిముషములలో. ఎంతసేపు ఎదుటి వానిని బాధించి, పడించి, పడుకోవటానికే ప్రయత్నం చేస్తాడు. తను ఏ కాంక్షతో ముందుకు పరుగెడుతున్నాడో తెలుసుకోలేడు. ఆపదగురాలలో ఏమైనా గోతిలోపడి అనుభవిస్తాడే గాని నిజానిజాలు తెలుసుకోలేడు. అలా తెలుసుకోవటానికైనా ప్రయత్నించడు' అని రవి తనమనస్సులో అనుకుంటూ శూన్యంలోకిచూస్తున్నాడు.

వర్షం తగ్గిపోయింది.

చందమామను కప్పుకొనిన మబ్బులు దూరంగా చెదరిపోతున్నాయి. కిటికి సందుల్లోనుంచి చల్లటిగాలి తెరలు తెరలుగా వీస్తుంది.

'అన్నయ్యా!........' అని కమల రవి గదిలోపలికి వచ్చి జాలిగా అంది.

'ఏమిటీ' అని బదులు పలికాడు రవి మెల్లగా చెల్లెమొహంకేసిచూసి ఆ గదివెలుగులో ఆమె మొహం మిలమిల మెరసిపోతుంది కాని....ఆమెలో వున్న నలుపుదనమే ఆమె సౌందర్యాన్ని పూర్తిగా కప్పివేస్తుంది. ఇంతకు కిత్రమే జరిగిన సంభాషణతో ఆమె మనస్సు ఏదో తెలియని విచారంతో క్రుంగిపోతుంది. 'తన పెళ్లికోసరము అమ్మా-అన్నయ్యలు ఎంత కష్టపడవలసి వస్తుందో?' అని అనుకుంటూ....?

'నీవుకూడ యింకా నిద్రపోలేదా? కమల!' అని రవి ఆశ్చర్యంగా అన్నాడు.

'నిద్రరావటంలేదు అన్నయ్యా!'

'ఎందుకు రాదమ్మా కండ్లు మూసుకుంటె? చాలా రాత్రయింది. హాయి పండుకో.' రవి కుర్చీలో నుంచి లేచి చెదరి యున్న ఆమె వెంట్రుకల్ని నవరుతూ అన్నాడు.

అది నిజాం కాలేజి ఆవరణ

ఎప్పుడు లేనిది ఆరోజు సరోజ కాలెజి టైముకు ముందుగానే వచ్చింది. సరోజ తలంటి పోసుకుంది కాబోలు జుత్తు వదులుగా అల్లుకుంది. ఆ జడలో వున్న మల్లెపూవులు తమ పరిమళాన్ని విరజిమ్ముతున్నాయి. నిత్యం చూస్తున్న సరోజ యే అయినా ఆరోజు కాలేజి విద్యార్థులకు ఏదో నూతన కళతో కళకళ లాడుతూ, విప్పారిన మొగ్గలా ఆమె యౌవనం వారికి కనిపిస్తుంది. కాలేజికి వచ్చే విద్యార్థులు ఆమెవైపు తీక్షణంగా వో చూపు చూసి మరి పోతున్నారు. నిజంగా ఆమెను చూసిన ప్రతివారికి హృదయం తపించి, ఆమెను పొందా లనే కాంక్ష కలుగక మానదు,

'ఓహో! సరోజా!! ఏమిటి....' ఈ రోజు చాలా తొందరగా దయ చేశారే?' రవి ఆమెను చిలిపిగా పరిశీలిస్తూ నవ్వుతూ అన్నాడు.

సరోజకు ఈ మాటకి వెంటనే కోపం వచ్చింది.

'బాగులెండి! నేను ఏం చేసినా మీకు నవ్వులాట మరి!' అంది.

'అదుగో అలాంటి మాటలే అనకూడదు సరోజ! నేను నిన్ను ఏమ న్నాను. నన్ను ఇలా అంటున్నావు? నా ఇలాంటి మాటలకు అనుమానాలు పెట్టుకోకు సరోజ!' అన్నాడు రవి.

'అంతేల్లెండి! మీరు మాటలు నేర్చినవారు మీతోటి మాట్లాడటమే మరి కష్టం!' అంది.

ఇంతలో రవి వీపు ఎవరో తట్టారు. ఆతడు హఠాత్తుగా వెనక్కు చూసి

'హల్లో! మోహన్!! నీవా....?' అన్నాడు రవి ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ.

'అయితే, బావా-మరదళ్లేదో రహస్యంగా ముచ్చటించుకుంటున్నారె!' అన్నాడు మోహన్ నవ్వుతూ.

'ఏమిలేదు లెండి? మా బావకు అప్పుడప్పుడు తలతిరుగుతుంటుంది.' అంది సరోజ వికటంగా పెద్ద నవ్వు నవ్వుతూ.

ఈ మాటకి రవి పైకి నవ్వాడె కాని, ఆ మాటకి అతని హృదయం చాలా బాధపడింది. ఏనాటికైనా సరోజ తన అర్ధాంగి కాబోతుందని తన కోపాన్ని అణుచుకున్నాడు.

మోహన్ రాగానే సరోజ హృదయం ఆనందంతో వికసించింది. ఇంత వరకు ఎవరి కోసమో అన్వేషిస్తున్న ఆమె కన్నులు ఇప్పుడు తృప్తిచెందాయి.

ఇంతలో కాలేజి గంట గణగణ మ్రోగుతూ, విద్యార్థులను హెచ్చరిస్తుంది. ముగ్గురు చిన్నగా ముందుకు నడిచారు.

మోహన్ ఒక సుందర యువకుడు. వయస్సుకూడ ఎక్కువలేదు. బహుశః యిరవైమూడో, యిరవైనాలుగో ఉంటుంది. ఒంకర తిరిగినజుట్టూ, అమాయకంగా చూసే నల్లటి కళ్ళు అతనికి ఎంతో వన్నె తెచ్చాయి. మోహన్ రవి ప్రాణస్నేహితుడు. ఇద్దరికీ కాలేజిలోనే స్నేహం కలసింది. మోహన్ చాలా బీదవాడు. ఈ ప్రపంచంలో అతనికి తల్లి తప్పితే ఆత్మీయులు ఎవరూ లేరు. ఇంటరులో రాంకు రాబట్టి స్కాలర్‌షిప్‌తో చదువుకొంటున్నాడు. మోహన్ అతి మధుర గాయకుడు కూడా. మొదటిసారి సరోజ అతని పాట వినటం, అతనితో పరిచయం చేసుకోవటము, సరోజ అతనిని ప్రేమించటమూ, అన్నీ కూడ ఒక్కసారె జరిగాయి.

ఆ రోజు కాలేజిలో కెమిస్ట్రీ ప్రాక్టికల్స్ జరుగుతున్నాయి.

అది పెద్దహాలు. ఆ హాలులో విద్యార్థులందరు అల్లరి చేసుకుంటు ప్రయోగాలు చేసుకుంటున్నారు. అందరు ఇద్దరు ఇద్దరుగా ఉన్నారు. సీరియల్ నెంబరు ప్రకారం సరోజ, మోహన్లు ఒకటి.

'నిజానికి ఈనాడు ప్రపంచంలో పరస్పర వైషమ్యాలు పెచ్చుపెరిగి పోవటానికి కారణం అణ్వాయుధాలేగదా? మోహన్!!' అంది సరోజ.

'అవును సరోజ! అణ్వాయుధాలద్వారా మానవజాతినే నశింపచేసే ప్రమాదం వ్యాపించియుంది. అమెరికా, రష్యా-ఈ రెండుదేశాలు పరస్పర పోటీలు పడుకుంటూ, హైడ్రోజన్, అటంబాంబులు తయ్యారుచేస్తూ,పరస్పర విద్వేషాలు పెంచుకుంటూ ప్రపంచ పరిస్థితులనే హీనస్థితికి తెస్తున్నవి' అన్నాడు.

'అయితే, ఈ అణ్వాయుధాల ద్వార మానవజాతి మహత్తరంగా అభివృద్ధి చెందే మార్గాలులేవా?' అంది సరోజ.

'ఈ మానవ జీవితాన్ని పురోగమనంతో మార్చివేయగల శక్తి అణుశక్తిలో వుంది. మొట్టమొదలు అణుయుద్ధ నిర్మూలన జరగాలి. ఇలా అణుశక్తితో పెద్ద పెద్ద మారణ ఆయుధాలు చేసి, ప్రపంచ వినాశానికి పూనుకొనే దాని కంటె, అణుశక్తితో మానవజాతి అభివృద్ధి చెందునట్లు, జాతి వికాసానికి ఉపయోగించటం అవసరం [illegible] ప్రేమభావంతో ప్రతి మానవుడు, తోటిమానవుణ్ణి ప్రతివేశం, ఇతర దేశాలను [illegible] సుఖ శాంతులు లభించగలవు. అలాంటప్పుడు ధర్మము, నీతి మానవులలో పెంపొంది మానవ చరిత్రనే మార్చివేయగలదు. విశ్వశాంతి [illegible] అయిన పండిత జవహర్‌లాల్ నెహ్రూ ప్రసాదించిన పంచశీలమే ముఖ్యం. అలా అందరు శాంతియుత సహజీవనం అలవర్చుకోవాలి. ఇప్పటికి 2500 సంవత్సరాలకు పూర్వము బుద్ధ భగవానుడు వుపదేశించిన ప్రేమ సందేశము ఇది అన్నాడు.

ప్రయోగం పూర్తిగా అయిపోయినతరువాత

'మోహన్! ఈరోజు సినిమాకి వెళ్ళుదామా? అంది సరోజ

'మరి కాలేజి....! ' అన్నాడు మోహన్

'కాలేజి కేముందిలే, మద్యాహ్నం తర్వాత ఒకటే పరియడ్గా వుంది' అంది.

'సరె!....ఎప్పుడు?' అన్నాడు.

'ఈ పీరియడ్ కాగానె! '

'అయితే, బయలుదేరుదాం!' అన్నాడు. ఇంతలో అక్కడికి రవివచ్చి

'ఏమండి....?' రవి సరోజ నుద్దేశించి అన్నాడు.

'ఓ హెూ!మీరా....?ఏమిటండీ! ఏంకావాలి? అంది పరిహాసంగా సరోజ

'మరి మనం ఎప్పుడు బయలుదేరుదాం' అన్నాడు రవి చలోక్తిగా.

'అయితే, మీరు విన్నారన్నమాట!' అంది.

'వినకేం....? అంత స్పష్టంగా వినరాలేదు'

'పోనీలెండి....ఇక యిప్పుడు చెప్తా వింటారా?'

'ఓ....! వినకేం? చెప్పండి! '

రవి మాట్లాడే మాటల తీరు చూసి, సరోజకు అనుమానం కలిగింది.

'బావా! అంతా విని సందేహిస్తున్నాడేమో?' ఎలాగమరి?' అనుకుంది మనస్సులో. క్షణంలో అద్భుతమైన ఆలోచన ఆమెకు తట్టింది. బావను ఇప్పుడు ఏవిధంగానైనా సంతోషపెట్టి, ఆ విషయాన్ని మరిపించాలి అనుకుంది.

'అదికాదు బావా! ఈరోజు దీపకులో 'తెనాలిరామకృష్ణ'గా! మనమం దరము కలిసిపోదాం పద! ' అంది.

"ఆహా! అలాగా!! నాకేమి అభ్యంతరంలేదు–నేను రెడీ! " అని మళ్ళీ వెంటనే 'కాని........! ' అన్నాడు.

'కాని....ఏమిటీ? అడిగింది సరోజ ఆశ్చర్యంగా.

'నేను చెపితే నీవు నమ్మవు!' అన్నాడు.

'ఏమిటీ బావా! నీవెకా కోళం' అంది. రవిమాటలు సరోజకు చిరాకు కలిగిస్తున్నాయి.

'అది ఏమిటో త్వరగా చెప్పేసెయ్ బావా! అంది సరోజ వినయపూర్వ కంగా.

ఇక మాటలలో ఆమెకు కష్టం తెప్పించటం రవికి ఇష్టంలేకపోయింది.

'సరే! విను!' అన్నాడు.

'వింటాను.... చెప్పు!' అంది.

'అయితే, ఇప్పుడు పోవటానికి వీలులేదు!' అన్నాడు.

'ఇది ఎవరి ఆజ్ఞ....?'అంది ఆశ్చర్యంగా.

'మీ అన్నగారి ఆజ్ఞ' అన్నాడు.

ఈ మాటలు వినగానే సరోజ మరింత గాభరా పడింది. ఆమె హృదయం జోరుగా కొట్టుకోవటం మొదలుపెట్టింది. తదేకంగా రవి మొహం లోకి చూస్తూ నిలబడిపోయింది కాని....ఆమెకు నోటిమాట రావటంలేదు.

'ఏమిటీ సరోజ అలా గాభరాపడి పోతావు?' అన్నాడు రవి జాలిగా.

సరోజ ఈ మాటకు వెంటనే తేరుకొని

అబ్బె!........ఏముంది? అని"అన్నయ్యా నీతోటి ఎప్పుడన్నాడు."

'దానికేనా నీవు విచారపడేది? అ! ఏముంది? ఉదయం కాలేజికి వస్తుంటె అన్నాడులే!' అన్నాడు.

'ఏమని....?' ఆశ్చర్యంగా సరోజ అడిగింది.

'ఈరోజు సినిమాకి పోదామని'

'ఎవరెవరూ........?'

'మనమందరము'

'ఎప్పుడూ....?'

'రెండవ ఆటకి'

'నిజంగానా?'

సూర్యుడు అప్పుడే అస్తమించాడు. అరుణ కిరణాలు అలసిపోయి అస్తమించగనే రంగురంగుల విద్యుద్దీపాలు రమణీయంగా తమ కిరణాలతో వెలుగుతూ, పట్టణానికి నూతన శోభను తెచ్చి పెట్టుతున్నాయి. రంగురంగుల విద్యుద్దీపాలతో ప్రకాశించు తున్న అఖిలభారత ప్రదర్శనాలయము, ప్రజలతో కిట కిట లాడుతుంది. ఆ రోజు సరోజ మోహన్లను కూడ ఎగ్జిబిషన్ ఆకర్షించింది. అందరు అన్ని విషయాలు చిత్ర విచిత్రంగా చూస్తున్నారు. ఇతర రాష్ట్రాలనుంచి వచ్చిన అద్భుతమైౖ కొత్త వస్తువులు ప్రజలను బాగా ఆకర్షించుతున్నాయి. ముఖ్యంగా కాశ్మీరు చీరలు, చేతిపనులు, పంజాబు చద్దర్లు, ఇలాంటి వెన్నోవున్నాయి. వ్యవసాయ పదర్శం, సాలారు జంగు మ్యూజియం, కుటీర పరిశ్రమ, జంతు పదర్శనశాల, రంగులరాట్నం, నిరంతరం పదర్శనం చుట్టు పచార్లు చేస్తున్న రైలు, పంచవర్ష ప్రణాళిక విషయాలు, ఆంధ్రప్రదేశ్‌లో అందులు సంస్కృతిని తెలిపే ఫోటోలు,సామాజిక అభివృద్ధి కార్యకలాపాలు, చైనీసు సర్కస్, తష్యన్‌స్టాల్, మొదలయినవి ప్రజలను విశేషంగా ఆకర్షించుతున్నాయి. నిజంగా చెప్పాలంటె ఎగ్జిబిషన్ ప్రజలను బలేగానే ఆకర్షించుతుంది.

మోహను, సరోజలు ప్రదర్శనమంతా తిరిగి విశ్రాంతికోసం ఎగ్జిబిషన్ కమిటివారు ఏర్పాటుచేసిన క్లబ్బు మైదానములో కూర్చున్నారు. అప్పుడు సుమారు ఎనిమిది గంటలయింది. అలసిపోయి వచ్చిన వారికోసం ఆ కమిటీ వారు ఏర్పాటుచేసిన సంగీతం, పాటలు వినటానికి ఇంపుగా ఉన్నాయి. కాఫీ, టీ, కేకలు కూడ చాలా ఇంపుగా అక్కడికి వినవస్తున్నాయి. ఆ ఇంపైన సంగీతం వినుకుంటూ అక్కడ కూర్చున్నవారు తన్మయత్వంతో హాయిగా ఆనందించుతున్నారు. ముఖ్యంగా 'చల్లని రాజా ఓ చందమామ' అనే పాట అక్కడికి వచ్చినవారిని బాగా ఆనందింపజేస్తుంది. అక్కడికి విచారాలతో వచ్చినవారు కూడ హాయిగా ఆపాట వినుకుంటూ, తమ చింత గాధలన్ని ఆ చల్లటి రాజకు చెప్పుకొని తృప్తిపడుతున్నారు. ప్రేమికులు తమ అమూల్య ప్రేమ సందేశాలను ఆ చల్లటిరాజ ద్వార పంపటానికి రహస్య సమాలోచనలు జప్పుకుంటున్నారు. నిజంగా ఇక ఆ పాట ఎంత అద్భుతమైనదో చెప్పనవసరములేదు.

'మోహన్! కాఫీ తాగుతావా?' అని అక్కడ 'కాఫీ' అనుకుంటూతిరుగుతున్న కుర్రవానిని కేకవేసింది.

అయిదు నిముషాలలో వారి చేతులలో వేడివేడి కాఫీ వచ్చి ఉంది. ఇద్దరు ఆ వేడివేడి కాఫీ త్రాగుతూ, ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటున్నారు. చూపుల్లో వాళ్లేదో ముసిముసి నవ్వులు నవ్వుకుంటున్నారు.

'నిన్ను ఒకవిషయం అడగాలనుకుంటున్నాను' అన్నాడు మోహన్ మెల్లగా.

సరోజ విచిత్రంగా అతని ముఖంకేసి చూసింది. ఆమె చూపులు ఆ అడుగాలనుకుంటున్నదేదో నిరభ్యంతరంగా అడుగవచ్చునని అతనికి సమాధాన మిచ్చాయి. ఆమె కన్నులుకూడ అట్టి జవాబుకే అన్వేషించుతున్నాయి.

'ఏమిటీ.......?' అంది మెల్లగా.

'నేను నిన్ను ప్రేమిస్తున్నాను. సరోజ!' అన్నాడు ఈ మాటలు వినగానే ఆమె కోమల హృదయం అపురూపంగా ఆనందంతో వికసించింది. ఆమె

కన్నులలో ఆశా జ్యోతి వెలిగింది. నిత్యమూ, ఆమె స్వప్నసీమల్లో విహరించిన సమాధానం ఆమెకు ఈనాడు దొరికింది.

"నిన్ను ఒదిలి నేను ఒక్క క్షణం కూడా జీవించలేను మోహన్!" అంది సరోజ అతని మొహంలోకి చూచి.

'నేను కూడ నిన్ను చూడకుండా ఆగలేను. కాని....మన ఇద్దరికి....' ఆ మాట పూర్తిగ అనకుండానే ఆగిపోయాడు.

'ఏమిటీ మోహన్! అ....కాని....? ఇంకా నీవు సందేహిస్తున్నావా?మన ఇద్దరిప్రేమ చాలా పవిత్రమైనది. శాశ్వతంగా ఎడబాటు గానిది. నేను జీవితంలో నిన్ను తప్ప యింకెవరిని కూడ కాంక్షించలేదు. నీవలా అంటా వెందుకు?' అంది.

'సరోజ! నేనెంతో దురదృష్టవంతుణ్ణి. నాకు ఆస్తులు, అంతస్తులు లేవు అంతస్తుకు లోపించని దానివినివు. అలాంటి నీకు,నాకూ....ఎక్కడ?'అన్నాడు

'అలా అనకు మోహన్. ఈ సంపదలు ఎల్లకాలం వుంటాయా? శాశ్వతం కాని సంపదలకు మన ప్రేమలు బలిచేసుకుంటామా?' అంది సరోజ.

'ఈ లోకంలో మానవుడికి తృప్తి, అసంతృప్తి కలిగించేది డబ్బు. ఇది ఒక్కటే మానవుని అమూల్య సంపద. మానవుడు వీటితోనె సుఖంగాజీవించ గలుగుతాడు. సర్వ సౌఖ్యాలు చేకూర్చునది ఆ డబ్బే..! మానవుడు జీవితంలో మృతి చెందేవరకు డబ్బునే కాంక్షించుతాడు.దీనిలోనె లీనమైపోతాడు తన కర్తవ్యాలనే మరచి దారితెలియకున్నా చీకట్లోపడి, ఆ డబ్బుకొఱకే వెతుక్కుంటూ వెళ్ళుతాడు. తన దారిని అడ్డగించిన వారిని తన్నుకుంటూ పోతాడు' అన్నాడు.

'నీవలా భయపడనవసరములేదు. నేను నీకు నీవు నాకు........అలా మనమిద్దరం ఒక్కటైపోతె అదే మనకు అమూల్య సంపద' అంది.

ఇంతవరకు మోహన్ హృదయం ఎవేవో ఆలోచనలతో ఆరాటపడినా, సరోజ చివరి మాటలు అతనిని బాగా ఆకర్షించాయి. అతనికి తెలియకుం

తానే మనస్సులో ఆశా జ్యోతి వెలుగులతో వెలసింది. మోహన్ సరోజ ముఖంలోకి చూశాడు. ఆమె కన్నులు సమాధానం కోసరం అన్వేషిస్తు న్నాయి. ఆమె నయనాలు విద్యుద్దీపపు కాంతిలో తారలవలె తళతళ మెరుస్తున్నాయి. ఆమె నవ్వుతూ అతని మోహంలోకి చూసింది. అతని సర్వ నాడులు సంపూర్ణ వికాసం చెంది సడలిపోయినవి. తీరని కోరికలు,భావాలు అతనిలో సముద్ర తరంగాలుగా ఉత్పన్నమయ్యాయి.

'సరోజ!' అని మోహన్, ఆమె రెండుచేతులను తన చేతుల్లోకి తీసుకుని'మన ప్రేమ పవిత్రమైనదని నాకిప్పటికి తెలసింది, అన్నాడుజాలిగా.

సరోజ అతని ముఖంలోకి చూస్తూ, మరింతగా జీవిత మధుర స్వప్నాలను హృదయంలో చిత్రించుకుంటుంది.

'మోహన్....!' అంది.

'సరోజ....!' అంటూ అతను ఆమెను తన దగ్గఱకి తీసుకున్నాడు. అదృష్టవశాత్తు ఆ క్షణంలో ప్రదర్శనమంతటా దీపాలు ఆరిపోయినవి. అంత వరకు సముజ్జ్వల కాంతితో ప్రకాశించుతున్న విద్యుద్దీపాలు అంతరించి వారికి సమయానుకూలంగా సదవకాశం కలిగించాయి. మోహన్ చేతుల స్పర్శతో ఆమె శరీరంలో సర్వావయవాలు అంతులేనిఆశాంతితోగిలగిల తన్నుకుంటున్నాయి. ఇంతకాలం ఆమెలో వున్న బాధ అగ్ని పర్వతంనుంచి వెలువడే దట్టమైన లావాలా పైకుబికింది. మెల్లగా ఆమెను అతని చేతులుచుట్టుకున్నాయి. ఆమె తృళ్ళిపడ్డది. 'ఫర్వాలేదు సరోజ' అంటూ ఆమెను తన కౌగిలిలో బంధించి వేశాడు. ఆమె నల్లటి కన్నులు యేమి యెరుగనట్లు అమాయకంగా చూస్తున్నవి. అతడు ఆమె జడలోవున్న మల్లెపూవులను చేతులతో మలినపరుస్తూ ముఖాన్ని దగ్గరికి లాక్కొని పెదవులపైన గాఢంగాముద్దు పెట్టుకున్నాడు. ఆమె సిగ్గుతో ముఖం త్రిప్పి, ఇంకా అతనిగుండెకు హత్తుకపోయింది. ఇంతలో హఠాత్తుగా ఆరిపోయిన విద్యుద్దీపాలు ప్రదర్శనమంతా అనుకోకుండానే వెలుగుతున్నాయి. అనుకోకుండానే వారి ప్రేమ బంధం కూడ విడిపోయింది.

'సరోజ! ఇక వెళ్ళుదామా?'

'సరే! నీ యిష్టం' అంది సరోజ.

'తిరిగి మీదర్శన మెప్పుడు?' అన్నాడు.

'రోజూ....ఈలాగే!' అంది సరోజ నవ్వుకుంటు. రాత్రి పదిగంట లయింది. మోహన్ ప్రదర్శనం నుంచి ఇంటికి చేరుకున్నాడు. ఇంతసేపు తల్లి అతని రాకకు ఆత్రతతో ఎదిరి చూసింది. మోహన్ తలుపుతీసుకొని ఇంట్లోకి అడుగుపెట్టగానె ఆమె హృదయంలో ఇంతవరకున్న ఆరాటం తగ్గిపోయింది.

'నాయనా, మోహన్! ఇంత రాత్రివరకు ఎక్కడ, ఏమిచేశావురా?' అంది తల్లి.

'ఎగ్జిబిషన్‌కు పోయానమ్మా!' అన్నాడు.

"ఇలా రోజు ఎగ్జిబిషన్లకు, సినిమాలకు తిరిగితే ఆ పరీక్షలో ఏం రాస్తావురా?" అంది.

అనుకోకుండా తల్లి ఈమాట అనేసరికి, అతనికి ఏం జవాబుచెప్పాలో తోచలేదు.

'నాయనా మోహన్! నీవు మన ఇంటి పరిస్థితులు చూస్తున్నావుగా. నేను ఎన్నికష్టాలుపడి మన సంసార భారాన్ని ఎలా ఎదుర్కొంటున్నానో తెలుసా? ఇదంతా ఎవరికొఱకు? కాని నీవు ఈ విషయాలలో అంతగా పట్టించుకోవటం లేదు. నేను కొన్నాళ్ళనుంచి చూస్తున్నాను. నీవు చదువు మీద కూడ అంతగా శ్రద్ధ వహించడములేదు. ఇలా ఎవెందుకు మారిపోతున్నావో నాకర్థంకావటంలేదు. నీవు ఇలాగె తిరిగి నీ చదువును పాడుచేసుకున్నావంటె, మునుముందు నీబ్రతుకు ఏమవుతుందో ఆలోచించు. జీవితంలో మానవుడు తన శక్తి కొలది ఏదో ఒక పని చేస్తూపుండాలి. మనశక్తి కొలది భగవంతుడు కూడ మనకు ప్రతిఫలమిస్తాడు. 'పుట్టినవాడు గిట్టక మానడు' అన్నట్లు ప్రతిజీవి మృతిచెందడం సహజమే! కాని....మృతి చెందేవరకు మానవుని విధి ఏమిటి? బాగా ఆలోచించుకో నాయనా! తోటివారిని సంతోషపెట్టి, సంతోషపడుటయే మానవుని ముఖ్యవిధి' అలా చేస్తె భగవంతుడు

కూడ సంతోషిస్తాడు. అయితే, నీవు నీతిగా బ్రతుకాలంటె జీవితంలో ఎన్నో కష్టాలు ఎదుర్కొనవలసి వస్తుంది. ఈ ప్రపంచంలో న్యాయం ధర్మం యెవ రికీ అవసరములేదు." పరస్పర జీవిత సంఘర్షణే యిక్కడి జీవిత పరమా వధి" ఇక్కడ వీటినన్నిటిని ధైర్యంగా శాంతితో ఎదుర్కొనాలి. అప్పుడు భగ వంతుడు తప్పకుండా నీకుతోడు ఒక దివ్యశక్తిని యిస్తాడు" అంది.

తల్లి ఈ మాటలు అతని హృదయంలో గట్టిగా నాటుకపోయినవి. అతనిలో ఇంతకాలం అణిగివున్న సానుభూతి వికసించింది. అతనికి ఏదో సముజ్జ్వలమైన కాంతి కిరణం అనంతం ఆకాశంలో మెరుపులా మెరిసి అగు పించింది. అతని బుగ్గలపై నుంచి కన్నీటి బిందువులు కాల్వలు కట్టి పారు తుంది.

'నన్ను క్షమించు అమ్మా! నేను కష్టపడుతాను. సాధిస్తానమ్మా ఫలి తం' మోహన్ తల్లిదగ్గరికి వచ్చి ఆమె రెండు చేతులు పట్టుకొని బ్రతిమాలు కున్నాడు.

'అలాగే నాయన! నీవాలా యెందుకు ఏడుస్తున్నావు. నిరంతరంధైర్యం వహించు. 'ధైర్యే-సాహసే-లక్ష్మి.' నీవాలా చేయటానికి భగవంతుడు నీకు శక్తినిచ్చుగాక! అని తల్లి మోహన్‌ను దీవించింది.

మోహను తల్లి శాంతమ్మ. మోహన్ పుట్టగానే తండ్రి చనిపోయాడు. అతనితోడు యింకెవ్వరూ లేరు. చాలా దగ్గఱఆత్మీయులు కూడ ఆమెకులేరు.

'మోహన్! చాలా రాత్రయింది. తిని పండుకుండువురా' అంది శాంతమ్మ మోహన్‌తో

తెల్లవారింది. రవి నిద్రనుంచి లేచాడు. లేచిన క్షణమే.

'సంఘం శరణం గచ్ఛామి
బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి'

రవి తన గదిలో వున్న బుద్ధభగవానుని పటముచూస్తూరెండుచేతులు జోడించి పైమాటలన్నాడు. తర్వాత శుభ్రంగా స్నానంచేసి, తెల్లని ఇస్త్రీ బట్టలు ధరించి తల్లికి నమస్కరించి బయలు దేరాడు.

సమయం తొమ్మిది గంటలయింది.

రామేశ్వరమ్మ ఏదో శుభవార్తకొఱకు ఇంట్లో ఎదిరిచూస్తూ కూర్చుంది. మధ్యమధ్య ఏదో తలుచుకొని తనలో తను సంబరపడిపోతుంది.

ఇంతలో రవి చేతిలో పేపరు పట్టుకొని వచ్చి.

'నేను ఫస్టు క్లాసులో ప్యాసయినానమ్మా!' అన్నాడు పట్టరాని సంతో షంతో. 'మన సరోజ, కమల కూడ ప్యాసయ్యారమ్మా!' మళ్ళీ తిరిగిఅన్నాడు.

ఈ మాటలకు రామేశ్వరమ్మ హృదయం ఆనందంతో పరవశమై అనంత 'పసుల్లో విహరించుతుంది. ఆమె రెండుకన్నుల నుంచి శుభసూచ కంగా కన్నీటి బిందువులు రాలి క్రింద పడినవి.

'కమలా! అమ్మకు నమస్కారం చేయ్!' అప్పుడే అక్కడికి వచ్చిన కమలతో రవి అన్నాడు.

'శుభస్య శీఘ్రం, కళ్యాణ ప్రాప్తిరస్తు' అని రామేశ్వరమ్మ వారిని దీవించింది. పాపం! అంతకంటె వారిని యింకేమని దీవిస్తుంది. ఇక ఆమెకు కావలసింది కూడా అది ఒక్కటేగా! దేవుడు దయతలుస్తే ఈ సంవత్సరమే చేయాలని ఆమె తలంపు. ఈ విషయమే మాట్లాడటానికి ఆమె అప్పుడె ఆనం దంతో అన్నదగ్గిరికి పోయింది.

రాఘవయ్య ఈజీచైరులో కూర్చుని ఏవో దీర్ఘంగా ఆలోచించుకుం టున్నాడు. అతడి ప్రక్కనే సరోజ, భార్య వున్నారు. వారురామే శ్వరమ్మ అక్కడికి రావటం చూసి.

'రా వదినారా!' అంది రాఘవయ్య భార్య. రాఘవయ్య భార్యపేరు రత్నమ్మ ఆమెకు నలుబది సంవత్సరాలుంటాయి. నలుబది సంవత్సరా లొచ్చినా ఆమె సౌందర్యం ఇంకా చెక్కు చెదరకుండా ఉంది.

'సరోజ! మీ అత్తయ్యకు నమస్కారం చేయ్ !' అన్నాడురాఘవయ్య

'శుభస్య శీఘ్రం కళ్యాణ ప్రాప్తిరస్తు' అని దీవించి 'నేనంతా విన్నాను,మీరంతా ప్యానయ్యారని' అంది రామేశ్వరమ్మ ఆశ్చర్యంగా

'అమ్మా చెల్లాయి, ఈరోజు, సాయంత్రం మీ అమ్మాయి కమలను చూడటానికి అబ్బాయి వస్తున్నాడు. మంచి సంబంధం. ఆబ్బాయి కొద్దిగ నలుపే అయినా, చూడటానికి బాగానే వుంటాడు. అయినా, ఈరోజుల్లో మగవాండ్ల అందచందాలు ఎవరు చూస్తారులే! ఎమ్. ఎ. ప్యానయ్యాడు కూడా! అతడు 'సరే!' అంటె వాళ్ళు ఈ సంవత్సరమే చేయుటానికి సిద్ధంగా ఉన్నారు. మరి నీవేమంటావు?' అన్నాడు రాఘవయ్య

'నాదేముంది. అంతా నీ యిష్టం. నేను మీ మాటను కాదంటానా అన్నయ్యా!' అంది రామేశ్వరమ్మ

'సరే! రవిని సాయంత్రం రైలుస్టేషన్‌కు పొమ్మను' అన్నాడు,

'అలాగే....కాని....' అంది

'మరి....అ....కాని ఏమిటమ్మా !' అన్నాడు.

'ఏముందిలే ! ఆ రవి పెండ్లికూడ....'అంది

'అలాగా....! దానికేముంది? మొదలు కమలపెళ్లి కానీ....! తర్వాత చూసుకుందాం' అన్నాడు.

'ఈవిషయంలో మీరు సరోజను అడగిచూడడం మంచిది. అన్నయ్యా!' అంది.

"పిచ్చిదాన ! సరోజ కాదంటుందా? నాముద్దుల బిడ్డ నామాట వినదా ఈ విషయంలో నీవు భయపడకు చెల్లాయి ? " అన్నాడు రాఘవయ్య నవ్వుకుంటూ.

"ఏమో....? ఎవరి మనస్సులు ఎలావుంటాయో? తెలుసుకుంటె మంచిది అన్నయ్యా ! " అంది రామేశ్వరమ్మ.

'అలాగే....తెలుసుకుంటాను' అని అమ్మాయి సరోజ!.... అని కేక వేశాడు.సరోజ ఎప్పుడు అక్కడనుంచి పోయిందో ఎవరికి తెలియదు.అందరు మాటల ముచ్చట్లోనె పడిపోయారు.

'పాపం నిస్పృహతో వాడిపోయినట్లుంది' అన్నాడు రాఘవయ్య.

'అన్నయ్యా! ఇక నేను వెళ్ళొస్తాను' అంది.

'అలాగేనమ్మా! అబ్బాయిని మాత్రం సాయంత్రం స్టేషన్‌కుపొమ్మను' అన్నాడు.

'అలాగే అన్నయ్యా!' అనుకుంటూ రామేశ్వరమ్మ వెళ్లిపోయింది.

అది సాయంత్రం అయిదు గంటలు. రవి ఒకగంట ముందుగానే వచ్చి, నాంపల్లి స్టేషన్‌లో ప్లాట్‌ఫారమ్ మీద నిలబడ్డాడు. అక్కడ చాలా మంది రైలు రాకకు కనిపెట్టుక చూస్తున్నారు. ఆ ప్లాట్‌ఫారమ్ అంతా హడావిడిగా వుంది. చుట్టుపక్ల కేకలు, అరుపులు, కష్టకరంగా వినవస్తున్నాయి. బండి సరైన టైమ్‌కి రావటానికి ఇంకా అరగంట వ్యవధివుంది. రవి చిన్నగా అక్కడనే యున్న రైల్వే హోటలుకి వెళ్ళి, కొద్దిగా ఫలహారము చేసి కాఫీ త్రాగి అక్కడ ఇవ్వవలసిన డబ్బులు యిచ్చి, మరల చిన్నగా ప్లాట్‌ఫారమ్ మీదికి వచ్చాడు. వచ్చిపోయే ప్రయాణికులకు, అక్కడ కూర్చోటానికి బెంచీలు కూడ ఉన్నాయి. కాని, బెంచీల మీద జనం సందులేకుండా కూర్చున్నారు.

ఇంతలో బండి వస్తూన్నదని తెలుపుతూ గంట గణగణమని మ్రోగింది. ఆ చప్పుడుకు అక్కడ ఇంతవరకు వేచి ఉన్నవారందరూ సంతృప్తికరంగా నిట్టూర్చేరు. ఒకాయన రెండవ తరగతి పెట్టెలోనుంచి మెల్లగా రవి దగ్గరికి వచ్చాడు. సుమారు ఇంచుమించు ఇరవై ఆరు ఏళ్ళు వుంటాయి. సిల్కు చొక్కా, ఉలన్ పాంట్, కళ్ళకు అద్దాలు పెట్టుకున్నాడు. చూడటానికి కొద్దిగ అందం కలవాడేనని చెప్పవచ్చు; రవి అతనికి ఆనందంతో అభివందనలు అర్పించి స్వాగతమిచ్చాడు.

ఆరోజు రామేశ్వరమ్మ కమలకు తలంటిపోసి, వాలుగా జడ అల్లి మల్లె చెండనుకట్టి, బొట్టెటు చివరకట్టించి ముచ్చటగా ముస్తాబుచేసింది. ఆ వచ్చిన అబ్బాయి కమల తొందరగ ఆకర్షించాలని ఆమె అభిప్రాయం.

'అసలు మీ స్వగ్రామం ఏవూరండి?' ఇద్దరు ఫలహారంచేసి కాఫీత్రాగి తాఫీగా కుర్చీలో కూర్చున్న తర్వాత రవి సంభాషణ మొదలుపెట్టాడు.

'మా స్వగ్రామం మహబూబు నగర్ కాని నేను చిన్నతనము నుంచి వరంగల్లో ఉంటున్నాను. మా నాన్న అక్కడ ప్లీడరుపని చేస్తున్నారు. నేనుకూడ అక్కడ కాలేజిలో లెక్చరర్‌గా ఉన్నాను.' అన్నాడు

'అయితే, మీ పేరేమిటి?' అన్నాడు రవి

'నాపేరు గోపాలకిషన్' అని సమాధాన మిచ్చాడు.

ఇంతలో అక్కడకి అప్సరసలా అలంకరించిన కమల వచ్చి నిలబడినది. అతడు కమలను బాగా పరిశీలించి చూస్తున్నాడు. ఆవిద్యుద్దీపపు వెలుగులో ఆమె ముఖం కళకళలాడుతుంది. కాని, ఆ సౌదర్యమును మాత్రం అతడు చూడలేకపోతున్నాడు. అతను ఆమె ముఖకళను చూసి ఏమనుకున్నాడో, ఏమోగాని, రవికికానీ, రామేశ్వరమ్మకుకాని, అర్థం కాలేదు. రామేశ్వరమ్మ ఒంటరిగా గుమ్మానికి దాపుగా నిలబడి, మనస్సులో వేయి దేవుళ్ళకు మొక్కుతూ, సమాధానం కొఱకు నమనిపోతుంది.

ఇంతవరకూ కమలను చూస్తున్న అతను భారంగా నిట్టూర్పు విడుచుకుంటూ లేచి నిల్చున్నాడు.

'ఇక వెళ్లి వస్తానండి! బండి వేళ దాటిపోతుంది. ఈవిషయంనాన్నను తెలుసుకొని ఉత్తరం వాస్తానుగా! అన్నాడు.

ఈ మాటలు వినుటముతోటె రవి హృదయం ఆగిపోయెటంతటి పనయింది, అతడు ఇక ఏమి మాట్లాడలేక పోయాడు.

'సరే!' అనిమాత్రము అనగలిగాడు. రామేశ్వరమ్మ యిదివిని కన్నీరు కార్చుకుంటూ ఇంట్లో ఒకమూల కూలబడి పోయింది.

రాత్రి తొమ్మిదయింది. ఇదివరకు వెలుగుతున్న దీపాలు ఒక్కసారే ఆరిపోయాయి. ఇంట్లో చీకట్లు దట్టంగా వ్యాపించి ఉన్నాయి. కమల ఈ అవమానాన్ని భరించలేక ఆరాటపడుతుంది. 'ఎందుకీ భగవంతుడు నాకీజన్మనిచ్చాడు. సంఘంలో స్త్రీలకెందుకీ అవమానాలు, స్త్రీకి సౌందర్యం ప్రధానమట! పురుషునికి అవసరము లేదట! ఏమిటీ విచిత్రం'అని మనస్సులో అనుకుంటుంది.

ఆమె హృదయంలో కోపం తోకత్రొక్కిన త్రాచుపాములా బుసలు కొడుతూ, తనను మరల ఇంకెవ్వరయినా చూసిపోవటానికి వచ్చినపుడు గాటువేసి తగిన సమాధానమిచ్చేటందుకు ఆరాట పడుతుంది.

రాత్రి రెండుగంటలు కావస్తోంది. రవికి నిద్ర సరిగా రావటంలేదు. చెల్లెలు దుస్థితి గురించే ఆలోచించుకుంటున్నాడు. ఏమిటబ్బా ఈ సమాజ నియమాలు. నిజంగా అమ్మ అనాడు చెప్పినట్లు అక్షరాల ఈ సమాజంలో అవినీతి నిండి ఉంది. మానవుడు తన తప్పును గుర్తించకయే. యితరులను నిందిస్తాడు. కేవలం కురూపి అయినంత మాత్రాన మానవుడు భగవంతుడు సృష్టించిన వస్తువును కాలదంతాడా? ఇది ఎక్కడి న్యాయం? అర్ధంకాదు. నిజంగా ఈలోకం కూడ అర్ధంకాదు. 'భగవంతుడు తన సృష్టిలో ఏలోటు చేయడు కాబట్టి అందరిని సౌందర్యవంతులుగానే సృజించుతాడని మరువ రాదు. కాని, మానవుడు ఆ సృష్టికర్త రహస్యాన్ని తెలుసుకోక తుదకు ఆ సృష్టికర్తనే నిందించుతాడు. శరీరం నలుపు అయినంత మాత్రాన వారి హృదయాలు, ఆశయాలు, ఆ వేశాలు, అన్ని కూడ నలుపేనా? నిజంగా ఈ లోకానికి గుణగణాలు, సత్య స్వభావము అవసరం లేదు. కాని...... అందం కావాలి. ఆనందం కావాలి. ఆ అందం, ఆనందం,అందంకల హరిశద్దనుంచే మానవునికి లభిస్తుంది కాబోలు! అయితే! భగవంతుడు సృష్టించిన కోయిల గూడా నల్లగా ఉంటాయిగదా! అయినంత మాత్రాన దానిని మనము అస హ్యించుకుంటామా? అవి మనల వాటిమధుర గానాలతో ఆనందింపజేయవా? ఈ విషయాలన్ని రవి మనస్సులో దొర్లి పోతున్నవి.

ఆది వసంత ఋతువు.మావుళ్ళు పచ్చని చివుళ్ళతో చిగిర్చిఉన్నాయి. కోయి లలు ఆలా చిగిర్చే లేత ఆకులను తినుకుంటూ, తమ గానాలకు నూతన రాగాలు సృష్టించుకుంటున్నాయి. ఆ లేత పచ్చని ఆకులు యిచ్చిన తీయని రాగాలతో, కోయిలలు కూయి:కూయి: మని కూస్తూ, సాయంత్రం వేళ లందు వాహ్యాళికై వచ్చిన మానవుల హృదయాలలోని మనస్సునురంజింప

జేస్తూ వారిని తన్మయత్వపరుస్తున్నాయి. ఆ గానాలను వినుకుంటూ, ఆనం దంలో పరవశులై అనంత ప్రేమల్లో విహరిస్తున్న వారిలో సరోజ మోహన్లు కూడ వున్నారు.

"సరోజ! ఇక మనకు ఎంతకాలం ఈ దాగుడుమూతలు? మన విష యం మీ నాన్నకు చెప్పేయకూడదూ?........" అని మోహన్ ఆమె ముఖం కేసి చూశాడు.

'నేను అలాగే అనుకుంటున్నాను' అంది

'కాని....మీ నాన్న .. ....?' అన్నాడు

'ఒప్పుకోడని నీకు అనుమానం కదూ?'

'అవును' అన్నాడు.

'నాకదే అనుమానముంది. మావాళ్లంవరు నన్ను మా బావతో ముడి పెట్టాలని చూస్తున్నారు. ఇది నాకిష్టంలేదు. మా నాన్న నన్ను బలవంతం చేస్తాడు. నాకిష్టంలేదంటాను. అలా నమ్మతించనట్లయితె నేనొక మంచి ఉపా యం ఆలోచించాను' అంది.

'ఏమిటా ఉపాయం సరోజ?' అన్నాడు.

'మనిద్దరం కలసి ఎటైనా పారిపోదాం' అంది.

ఆ మాటలకు మోహన్ హృదయంలో అంతులేని ఆలోచనలు సముద్ర తరంగాలుగా మహావేగముతో అంతర్నాళాలలో ప్రవహించుతున్నవి. తానేదో తప్పు చేస్తున్నట్లు, ఇది మహాద్రోహం అన్నట్లు. తన మీదనే పంచ ప్రాణాలు పెట్టుకొని ఉన్న తల్లికా....? ' అతని మనస్సులో మెదులుతుంది. దీనితో అతని హృదయం ఏదో ఒక నిర్ణయమునకు వచ్చుటకు ఆరాటపడుతుంది. 'నేను జీవితంలో ఆదర్శంగా వుంటానని, కష్ట-సుఖాలను తలుచుకుంటూ జీవయాత్ర సాగిస్తానని' ఒకనాడు తల్లికి ఇచ్చిన వాగ్దానం జ్ఞాపకమొస్తుంది. ఈ విషయం తలుచుకునేటప్పటికి అతని హృదయంలో ఆ వేదనలు ఎక్కువైపోతున్నాయి.

'ఏం నీ కిష్టములేదా?' అంది సరోజ అతని ముఖంకేసి చూస్తూ.

'మనం ఇలా పారిపోతె సమాజం ఏమంటుంది? మీ నాన్న నలుగురిలో ఏమొఖం పెట్టుకొని తిరుగుతాడు? ఇదిలోకం, ఈ సమాజంలో ప్రతి వ్యక్తి నిర్మొహమాటంగా తిరుగటానికి వీలులేదు. కొన్ని సమాజ నియమాలకు మనము కట్టుబడి వుండవలసి వస్తుంది. ఈ జీవితం ఒక అసమర్థపు బ్రతుకు. ఇక్కడ ఒకరి మనస్తత్వాలు. యింకొకరికి అవసరంలేదు. అలా అర్థం చేసుకోవటానికైనా ప్రయత్నించరు. నీవిలా ఆవేశంలో మీ నాన్నపరువు మర్యాదలు మంటగలుపకు. బాగా ఆలోచించు. అన్నివిషయాలు బాగా అర్థంచేసుకోగలవు. నీస్వశక్తితో మీ నాన్నను ఒప్పించి నీ కార్యదక్షతను సాధించు. 'ప్రయత్నించు ఫలితం లభిస్తుంది' అనేవిషయాన్ని మరువరాదు! అన్నాడు.

'అలాగె ప్రయత్నిస్తాను.' అనిఆమె అతనిఒడిలో వాలిపోయింది. అతను కూడా ఆమెను హత్తుకొన్నాడు ఆమె నల్లటి వెంట్రుకలను నిమురుతూ, చెక్కిళ్ళను గాడంగా అదుముకొని ముద్దు పెట్టుకొనపోయె సరికి, ఆమె సిగ్గుతో ముఖాన్ని వదిలించుకపోయింది.

ఇప్పుడేగాదు 'పెళ్లయితేనే' అని కన్నులు సమాధానం చెప్పాయి.

ఈ దృశ్యం రవి కంటబడింది. ఎప్పుడు వచ్చాడో తెలియదు. కాని, చాలా సేపటినుంచి మాత్రము వీరి సంభాషణ వింటున్నాడు. కొన్నాళ్ళనుంచి మాత్రము వీరిద్దరిని అనుమానిస్తున్నాడు. ఈనాడు అతని అనుమానం నిజమయింది. ఆ నిజాన్ని తన రెండు కన్నులతోటె చూశాడు. అతని హృదయంలో బాధ వేయి కంఠాలతో ఘోషపెడుతుంది. అతనిలో తీరని అశాంతి తుఫానులా చెలరేగుతుంది. 'సరోజకు తనంటె ఎందుకసహ్యమో? తెలసింది... మా అమ్మకు ఈ విషయం తెలిస్తే బ్రతుకు తుందా? ఇప్పటికే అవమానంతో కృంగి పోతున్న ఆమె హృదయం, ఈ విషయాన్ని తెలుసుకుంటె మరెంత బాధపడుతుందో.?' అని అనుకుంటున్నాడు. అతనికి ఏటు తోయటంలేదు. తానేమిచేయాలి? ఈ విధంగా అతని మనస్సు పలువిధాల ఆలోచనలను ఆలోచిస్తుంది? చాలా సేపటివరకు అక్కడె ఆలోచించు

కుంటూ కూర్చున్నాడు. ఇంతవరకు ఆలోచించుకుంటూ కూర్చున్న రవి అప్పుడే పన్నెండు గంటలు కొట్టిన గడియారం చప్పుడుకు తృళ్ళిపడి లేచి యింటిదారి పట్టాడు. చల్లగ గాలి వీస్తుంది. లోకమంతా నిశాదేవి వడిలో హాయిగా నిద్రపోతుంది.

ఆరోజు ఉగాదిపండుగ నూతన సంవత్సరానికి మొదటిదినము ప్రతిఇల్లు పచ్చపచ్చని తోరణాలతో కళకళలాడుతుంది. ప్రజలంతా పట్టరాని ఆనందంతో తొణికిసలాడుతున్నారు. దేవాలయాలలో హరికథలు, పంచాంగ పఠనములు జర్గుతున్నాయి. కొందరు తమ తమ జాతకాలు చూసుకొని ఆనందించుచుంటె, మరి కొందరు విచారిస్తున్నారు. వారిలో ఒకరు రామేశ్వరమ్మ. ప్రతిరోజు కొడుకు, కూతుర్ల దుస్థితి తలుచుకుంటూ బాధపడుతుంది. 'ఇంత వయస్సులో వాళ్ళకి వైరాగ్యాలేమిటి?' అని ప్రతినిత్యం మనస్సులో అనుకొని దిగులుపడుతుంది. ఇప్పుడు ఆమె మనస్సు మనస్సులో లేదు. ఇంతకాలం ఆమె ఆశించిన ఆశయాలు కుప్పలా కూలిపోయినవి. సరోజ రవిని చేసుకోవటానికి ఇష్టపడలేదు. కమలను చేసుకోవటానికి వచ్చినవారు వలవని పోతున్నారు. రవి ఇప్పుడు తాగుబోతయ్యాడు. అతడు ఇంటిపట్టున సరిగా వుండటములేదు. ఇవంతా తలుచుకుంటె రామేశ్వరమ్మ దుఃఖము ఇంతా అంతా కాదు.

అప్పుడు సుమారు ఏడుగంటలు. ఇంటింట రంగురంగుల దీపాలు దేదీప్యమానంగా వెలుగులు వెలుగుతుంటె రామేశ్వరమ్మ ఇంట్లో, చీకట్లు మరింత దట్టంగా కమ్ముకుంటున్నాయి. దీపాలు వెలిగిద్దామని యెవరికి ఉద్దేశ్యమేలేదు. ఆకారు చీకట్లో కమల ఒక మూలన కూర్చొని తన దుస్థితిని గురించి ఆలోచిస్తుంది. ఇంతలో రవి తప్పత్రాగి, తనను తానుసంబాళించుకోలేని స్థితిలో తలుపులు తెరచుకొని అడుగుపెట్టాడు. రామేశ్వరమ్మ అతని స్థితిచూసి నిర్ఘాంతపోయింది. తన కొడుకు ఒక త్రాగుబోతుగా ప్రత్యక్షమయ్యేసరికి ఆమె గుండె ఆగిపోయినట్లనది. కొన్నాళ్ళనుంచి రవి ఈ విధంగా

త్రాగుతూ, తన్మయత్వముతో తందనాలు ఆడుకుంటూ చెడుతిరుగుళ్ళు తిరుగుతున్నాడు. ఎక్కువగా ఇంట్లో వుండటంలేదు. అతని మనస్సుకు శాంతి లేదు. ఎప్పుడు ఏదో దీర్ఘంగా ఆలోచించుకుంటూ ఉంటాడు. ఎవరితోను మాట్లాడడు. అందరు అతన్ని చూసి ఆశ్చర్యపోతున్నారు. 'రవి ఎందుకిలా మారిపోయాడు' అంటూ తలకొక విధంగా అనుకుంటున్నారు. కాని—అసలు కారణమేమిటో ఎవరు తెలుసుకోవటం లేదు. ఆ కారణం ఒక్క కన్నతల్లిక మాత్రమే తెలుసు. కాని లోకానికి మాత్రం తెలుపదు. నలుగురు మాత్రం చీదరించుకుని ఆడిపోస్తున్నారు. 'పండంటి ఆమె సంసారం ఎందుకలా పతనమై పోతుందో?' అది రామేశ్వరమ్మకే తెలుసు. రవి తూలుతూ మెల్లగా తన గది తలుపులు తీసుకొని పోబోతున్నాడు.

'రవి!' అనిపిలిచి 'నీవిలా ఎందుకు మారిపోయావు, నీవురోజు ఇలా త్రాగి తందనాలు ఆడుతుంటె అందరు ఏమంటారు? ఎవరిని దూషిస్తారు? నిన్ను......కాదు, నన్ను. నీవిలా త్రిప్పతాగి చెడుతిరుగుళ్ళు తిరిగితే లోకం ఏమంటుంది? నిగతేమవుతుంది? నీ చెల్లెలు భవిష్యత్తు కూడ ఆలోచించావా? అసలే అది నలుపుగా వుందని అందరు చేసుకోవటానికి నిరాకరించుతుంటె, నీవుత్రాగుబోతువని తెలిస్తె యింకెవ్వరొస్తారు....? నాయనా! నీ హృదయంలోని బాధ నాకుతెలుసు. నీవు ఎందుకు తాగుతున్నావో కూడ నాకు తెలుసు. దానివలన నీవు బాధలను మరచిపోగలవు. నీకు మంచిచెడు విచక్షణా జ్ఞానమె వుండదు. కాని, మన కుటుంబం చివరికి ఏ దుస్థితికి వస్తుందో తెలుసా? రవి....! నీ చెల్లెల్ని చూసైనా ఈ తాగుడు మానేయి?' రామేశ్వరమ్మ దీనస్వరంతో కొడుకును బతిమాలింది.

'లోకం పిచ్చిది! ఇక్కడ నీతి నిజాయితి ఎవరికి అవసరంలేదు.... అయితే! నేను త్రాగితేఏం.......?'

'నాయనా! రవి....లోకం పిచ్చిదని నీవు కూడా పిచ్చివాడవౌతావా? నీ నిజాయితి లోకానికి అవసరములేకున్నా ఆ భగవంతునికి తప్పక కావాలి! ఇక్కడ నీతి నిజాయితి నిజంగానే యెవరికీ అవసరం లేదు, ఒకరి అవమా

నము, ఆవేదన, నిరాదరణ, అన్యాయము అశాంతి కూడ ఎవరికి అవసరం లేదు. ఎవరి పరాభవాగ్ని జ్వాలలు వారే ఆణుచుకోవాలి. న్యాయానికి, ధర్మానికి తావులేదు. ఈ తుచ్ఛ సమాజంలో దీనికి మంచిచెడు కూడా తెలియదు. నీవాలా త్యాగి సుఖ మనుభవిస్తూ, లోకం చేత నగు బాటు కావడంకన్నా, యింకేమిలేదు. కాని, సాధించేదేమిలేదు. కష్ట సుఖాలను భాగం పంచుకోవాలి గాని, మనశ్శాంతికోఱకు దారుణావా? ఇంతమాత్రానికే మన జీవితాలను నాశనం చేసుకుంటె ఎట్లా? మానవ హృదయానికి మచ్చలేకుండా వుండాలంటె నిర్మలమైన నడత కలిగివుండాలి. అదే మానవలక్ష్యం. భయం, భ్రాంతి, చీకటి, ఆకలి, పాపం, బాధ,కష్టలతో మానవ జీవితం నిండిఉంది వీటినన్నిటిని నిష్కల్మషంగాఎదుర్కొనుట మానవుని విధి అంది.

రవి కణంసేపు ఆలోచించాడు. అతని హృదయంలో కరుడుగట్టిన అజ్ఞానం కరిగిపోతుంది. అంతర్నాళాలు కట్టలు త్రెంచుకొని వరదలై పారిపోతుంది. ఆమె మాటలు అతనిని సిద్ధాంత పరిచాయి. అజ్ఞానంలోనుంచి తేరుకొని వెలుగులో పడ్డాడు, ఆ వెలుగులో అతని మనస్సు ఆనందంతో వికసించింది. అతని నేత్రాలు శుభ సూచకంగా ఆనంద బాష్పాలు క్రుమ్మ్రుకున్నాయి.

'నేను పాపిని, నన్ను క్షమించు అమ్మా! ఇక నేనెప్పుడు ఇలాంటిబుద్ధి తక్కువ పనులు చేయను.'

ఈ మాటలు వినగా తల్లి ముఖం ఆనందంతో వికసించింది. ఆమె నేత్రాలు ఉజ్వలంగా ప్రకాశించాయి. ఆమె ఏమి మాట్లాడటములేదు. ఆమె నేత్రాలు మాత్రమే అతని మనస్సులోకి దివ్యజ్ఞానాన్ని పంపుతున్నాయి.

రాత్రి రెండుగంటలు దాటింది. అంతరాత్రివేళ్ళ రవి తన గదిలో నిరుత్సాహంగా అటు ఇటు తిరుగుతున్నాడు. ఆ గదిలో బెడులైటు వెనుక మనకగా కాంతి ప్రసరిస్తోంది. అతనికి జీవితంలో జరిగిన సంఘటనలన్ని ఒక్కటొక్కటి జ్ఞాపకమొస్తున్నాయి. వాటిని బలవంతాన అణుచుకోవటానికి ప్రయత్నించుతున్నాడు. కాని లాభంలేదు. మధ్య మధ్య నిస్పృహగా నవ్వు

తున్నాడు. 'సరోజ! నన్ను ప్రేమించలేదు. కాని, నామనస్సు అమెను ప్రేమించుతుంది. ఇవంతా నా తప్పు. ఎవరి హృదయాలు ఎలావుంటా వో, ఎవరిప్రేమలు ఎలావుంటావో నా కిప్పుడు అర్థమయింది నేను అమెప్రేమను పొందలేక పోయినప్పటికి,అమె వలన నాకువో దివ్యజ్ఞానం లభించింది అనంత దూరములో ఆ దివ్యజ్యోతి కనిపించుతుంది. కాని, అది చూచి మాత్రమే ఆనందించమని అమెగారి ఆజ్ఞ! అయితే, ఇప్పుడు తన కర్తవ్యమేమిటి....? నాపెండ్లివిషయంలో సరోజ మామయ్యలకు మధ్య భీకర సంఘర్షణ జరిగింపట! అయినా సరోజ మోహన్‌ను తప్ప వేరొకరిని పెండ్లిచేసుకోనని పట్టు పట్టిందట! యధార్థంగా ఇది నిజం! సరోజ అతనిని ప్రేమించింది. మనస్సు యిచ్చింది. అలాంటప్పుడు అమె యింకెవరిని చేసుకోవటానికి ఒప్పుకుంటుంది? ప్రేమించి పెండ్లి చేసుకుంటేనే జీవితాలు సుఖవంత మవుతాయి. పాపం! మామయ్యకు ఈ విషయం తెలియదు. తనకుటుంబ ప్రతిష్టకోసరం అమె జీవితం నాశనం చేస్తే ఎట్లా? మేనరికం కాలదన్నకూడదని ఆయన అభిప్రాయం కాబోలు. నేడు ఇలాఎందరి జీవితాలు నాశనమౌతున్నాయో? మామయ్యను నేను ఒప్పిస్తాను నాకు కూడ సరోజను చేసుకోటానికి ఇష్టం లేదంటాను.ఇలాఅంటెమామయ్యతప్పక ఒప్పుకుంటాడు. నిజంగామామయ్య చాలా మంచివాడు. నాకోసం ఆయన ఇంతగా తాపత్రయపడుతున్నాడంటె ఇక వేరే చెప్పనవసరంలేదు. అంతా ఊహించుకోవలసిందే! ఇక కమల సంగతి దానికి కూడ ఒకసంబంధం చూడవలసివుంది. ఎన్నాళ్ళు ఇలా ఇంట్లో వుంటుంది. 'ఆడపిల్లలు ఇంటికి భారం' అన్నట్లు నిజమే! రవి మనస్సులో ఈవిధంగా అనుకుంటూ గదినుంచి బయటకు వచ్చాడు. కమల కూడ వరండాలో కూర్చొని వుంది. రవి మెల్లగా అమె దగ్గరికి పోయి తల నిమురుతూ,

ఎందుకలా విచారపడుతావు చెల్లాయి? మీ అన్నయ్య వుండగా నీకెందుకమ్మా భయం, అని తిరిగి వెంటనే నేను నీకింతవరకూ మహా ద్రోహం చేశానమ్మా! ఈ లోకంలో ఒకరి మనస్సులోని బాధలు, ఎవ్వరూ

పట్టించుకోరు. ఇలా వస్తాయని తెలుసుకొని ఏ కొంచైనా ప్రయత్నించరు. ఎవరి తత్త్వము వారి అంతాలు వారివే! ' అన్నాడు రవి బాధగా నిట్టూర్పుచెంది.

'ఇలా అనుకోను అన్నయ్యా! ఇందులో నీతప్పేమిలేదు. ఇదంతా విధి రాత. నా జీవిత గమనం ఎలా సాగిపోవాలో, అలా సాగిపోతుంది' అంది కమల విప్పుసంటూ.

రవికి జీవితంలో రకరకాల కష్టాలనుభవించటవల్ల, అతనికి తిరుగుళ్ళ మీద విసుకు పుట్టింది. యేమయినాపనిమీద ఎప్పుడోఒకసారి యెక్కడి కన్నా వెళ్ళితే తప్ప, ఇక దినమంతా ఇంటి పట్టున వుండటం మొదలు పెట్టాడు. రవి మంచిదారికి వచ్చినందుకు రామేశ్వరమ్మ ఆనందించింది కాని, ఆమెలోని అసలు విచారం దూరం కాలేదు. ఇక కావలసినది ఆమెకు వారి పెండ్లిళ్ళు ఈ విషయమే ఆమెను ప్రతినిత్యమూ మరింతగాబాధించుతుంది.

అవి సాయంత్రం ఎనిమిది గంటలు కావస్తోంది. రవి భోజనానంతరం సరోజ యింటికి ఎందుకో బయలుదేరాడు. ఆకాశంలో పౌర్ణమినాటి చంద్రుడు స్వేచ్ఛగా ప్రకాశించుతున్నాడు. సరోజ గదిలో మోకాళ్ళమీద మోచేతు లానించి నడుముక్రింద చేతులు పెట్టుకొని, కిటికీ గుండా చంద్రుని వంక, శూన్యంలోకి చూస్తుంది. ఇంతలో అడుగుల సవ్వడి విని వులిక్కిపడి వెనుకకు తిరిగి చూసింది.

'నీవా బావా........? ' అంది సరోజ మెల్లగా బాధతో నిట్టూర్పుచెంది ఆమె పూర్తిగా చిక్కిపోయింది. ఆమె పరిస్థితులు కూడ పూర్తిగా మారిపో యినట్లున్నది. ఎవరైనా ఆమె ముఖం చూస్తేనే వినుకుంటారు. ఇదివరకున్న అహంకారం ఇప్పుడు ఆమెలో లేదు. దినమంతా ఏదో ఆలోచించు కుంటూ తన గదిలోనె వుంటుంది. రవి తను తలపెట్టిన అన్యాయంవల్లనే పూర్తిగా చెడిపోయాడని అందరు అనుకోవటము విన్నది. నిజంగానే బావ తనవలనే పూర్తిగా చెడిపోయాడు. తనను అనురాగంతో ఇంతవరకు చూస్తున్న తల్లి తండ్రులు కూడ ఇప్పుడు తన్ను చూసి అసహ్యించుకుంటు న్నారు. నేను ఏది చెప్పినా వినిపించుకోవటములేదు, నాన్న పట్టిన పట్టు విడు

పటము లేదు. నేను నీ పెండ్లి చేయటమైనా మానుకుంటాను గాని మోహన్ తో మాత్రం కాదంటున్నాడు. అమ్మయ్యలు అదే అంటున్నారు. అయితే, ఏమి చేయటం? ఎన్నో ఆశలు పెట్టుకొని ఉన్న మా అత్తయ్యా, బావలకు ద్రోహం చేస్తున్నాను. అందరి క్షేమముకొఱకు నేను బావను చేసుకోవటమే మంచిది అని సరోజ నిశ్చయించుకుంది. ఆమె రవి ముఖంలోకి చూసింది. అతని ముఖం వాలిపోయింది. కన్నులు అమాయకంగా దేనికొరకో చూస్తున్నవి. తైలసంస్కారం లేక జుట్టంతా చెదరిపోయి వుంది. ఆమెకు అతని స్థితిచూసి జాలివేసింది.

"నన్ను క్షమించు బావా....!" అంది ఏడ్చుకుంటూ.

'ఎందుకు....? సరోజ! నిన్ను క్షమించేది?' అన్నాడు రవి.

నేను నీకు మహాద్రోహంచేశాను బావా... ! నేను నిన్ను పెండ్లిచేసుకుంటాను అంది సరోజ.

'పిచ్చిదాన! ఈ లోకంలో ఒకరికి యింకొకరు ద్రోహంచేయరు? అంతా ఆపైది విలాసం, నీ సంగతి నాకంతా తెలుసు. నీపట్టుదలలో మహత్తర శక్తి ఇమిడి వుంది. కాని, అది ఎవరూ తెలుసుకోవటంలేదు. నీవు మోహన్ను ప్రేమిస్తున్నావు. మోహన్ నిన్ను ప్రేమిస్తున్నాడు. మీ ఇద్దరిప్రేమ చాలా పవిత్రమైనది. అది మీ ఇద్దరిని సుఖవంతం చేస్తుంది. జీవితంలో ఎలాంటి విపత్కల్మష కష్టాలనైనా ఎదుర్కొనగలదు. నీ మనస్సంతా వేరొకరిమీద వుంచుకొని నన్ను పెండ్లిచేసుకొని మాత్రం నీకేమిలాభం? నాకేమిలాభం? ఇందులో ఎవరికి లాభంలేదు. నీవు నా దుస్థితి గురించి ఆలోచించకు. మొదలు నీ లాభం చూసుకో. నీవు ఈ విషయం బాగా ఆలోచించు. అది నీకు తెలుస్తుంది. మామయ్యను నేను ఒప్పిస్తాను. నీవుభయపడకు' అన్నాడు.

'ఏమిటి బావ నీవు మాట్లాడేది?' అంది సరోజ జాలిగా.

'అవును....సరోజ! నీముందే మాట్లాడుతున్నాను. నీబావ, నీక్షేమంకోరి నీ సౌఖ్యం కోసరం, ఆపరమేశ్వరుని సాక్షిగా, నామనస్సు పూర్తిగా మాట యిస్తున్నాను సరోజ! అన్నాడు రవి నవ్వుకుంటూ.

సరోజ ఈమాట విని రవి ముఖంలోకి చూసింది. అతనిలోని మంచి తనము అమెకీనాడుతెలిసింది. ఆమె హృదయం ఒక వంక ఆనందంతోనిండి ఉంది. మరొకవంక బావ దుస్థితిని తలుచుకొని బాధపడుతుంది. ఆమె ఇక ఏమి మాట్లాడలేకపోయింది. 'సరే! ' అన్నట్లు ఆమె కన్నులు బాధగా సమాధానం చెప్పాయి.

రవి చిన్నగా అక్కడినుంచి బయలుదేరాడు. రాఘవయ్య వరండాలో కూర్చొని కూతురు దుస్థితిని తలుచుకుంటున్నట్లున్నాడు. రవి రాపటంచూసి ఆశ్చర్యంగా.

'ఎంతసేపయిందోయ్ వచ్చి?' అని రాఘవయ్య ప్రశ్నించాడు.

'సరోజ గదికెళ్లి వస్తున్నాను..........' అన్నాడు రవి.

'అయితే, సరోజ ఏమన్నది?'

'ఏమంటుంది? తన పట్టుదలను విడువనంటుంది' అన్నాడు.

"అయితే, నీవేమంటావు?'

"నేనేమంటాను! సరోజ యిష్టప్రకారమే, మోహన్‌తో పెండ్లి చేయమంటాను. మీరు అన్యథా భావించవద్దు. నేను చెప్పేది మీ దృష్టిలో తప్పుగా వుండొచ్చు—అలా అనుకోవటం మీ తప్పు' అన్నాడు.

'రవి! నీకు జ్ఞానంలేదు. నీవలా మాట్లాడటానికి నోరు ఎలా వచ్చిందోయ్! దానిని చిన్నప్పటినుంచి నీకిస్తామని పేరుపెట్టుకొని, మనస్ఫూర్తిగా నా చెల్లాయికి మాటయిచ్చాను. అలాంటప్పుడు ఆమెను వేరొకరికిచ్చి పెండ్లి ఎలా చేయమంటావు? అదెలా సాధ్యపడుతుంది, రవి!' అన్నాడు రాఘవయ్య.

'అది తప్పు మామయ్యా! మీ ఇష్టానుసారం, మీలాభం కోరకేగాక సరోజ లాభం కూడ చూడండి. ఆమె సౌభాగ్యాన్ని మంటగలుపకండి! ఆమె మనోభావాలు గుర్తించండి. మా అమ్మకు మాటయిచ్చారంటె, ఎవర్ని అడిగి యిచ్చారు. సరోజనడిగారా? లేక నన్ను అడిగారా?' అన్నాడు.

రవి ఇలా మాట్లాడుతాడని రాఘవయ్య ఎన్నడు కూడ అనుకోలేదు. ఆయన లోదాగియున్న అజ్ఞానం దూరమయింది.

'రవి....! నీవు చాలా మంచివాడవోయ్. నీలాంటి గుణగణాలు కల వ్యక్తులు ఈ లోకంలో చాలా అరుదుగా ఉంటారు....... ....సరె! సరోజయిష్ట ప్రకారమే! '

రవి అనుకున్న ఆశలు ఒక శుభదినమున ఫలించినవి. సరోజ, కమల పెండ్లిళ్ళు జర్గిపోయినవి. రవికి మరల జీవితంలో ఒడుదుడుకులు ప్రారంభమయ్యాయి. అంతవరకూ పెద్ద దిక్కంటూవున్న తల్లికూడ మలేరియా జ్వరంతో పరలోకం చేరింది. రవికి ఇప్పుడు ఎవరూ దిక్కులేక స్వభావంనుంచి మరల పూర్తిగా చెడిపోయాడు.జీవితంలో ఇంతవరకుతోడునీడగా వుంటున్నతల్లి పోవటంనుంచి మరింతగా పాడయ్యాడు. అతనిని మంచి దారిన తేవటానికి ఎవరూ లేరు. ఇక చెల్లెలు వున్నదంటే-ఆమె అత్తగారింటిలో కాపురం చేస్తుంది. అతనివెనుక ఏదో బాధవుంది. ఆ విషయమే రవి అప్పుడప్పుడు తలుచుకొని బాధపడుతుంటాడు. కాని, ఆ బాధను తీర్చేటందుకు ఎవరూలేరు. బహుశః ఈ బాధను మరచిపోవటానికి కాబోలు త్రాగుడు అలవాటు చేసుకున్నాడు. 'ప్రతిజీవికి ఈ లోకంలో పెండ్లి చేసుకొని సుఖజీవిత యాత్రను సాగించాలని వాంఛ వుంటుంది. ఇదే వాంఛ రవిలో కలిగింది. అయితే! యిప్పుడు అతడు త్రాగుబోతు. చపలచిత్తుడు. పిచ్చివాడు' అని అతనిని లోకం అనుకుంటుంది. అలాంటప్పుడు ఎవరు అతనికి ధైర్యంచేసి పిల్ల నిస్తారు? రవి ఇదే ఆలోచనతో రోజు బాధపడుతుంటాడు. యీ బాధ అతని మనస్సును స్థిమితములేకుండా చేసింది. ఆ బాధతోటె అతడు చపల చిత్తుడు, త్రాగుబోతు అయ్యాడు. కాని ఇది యెవరు తెలుసుకుంటారు?

రవి రోజు త్రాగుతూ, తిరుగుతూ, ఉంటాడు. ఇలా త్రాగుడువలన అతని ఆరోగ్యం పూర్తిగ క్షీణించింది. దానికితోడు అతనికిబాధనురోగటి. దీని వలన అతడు పూర్తిగా చిక్కి శల్యమై అస్థిపంజరంలా తయ్యారయ్యాడు.

ఇలా అతని శరీరం క్షీణించుతున్నా త్రాగుడు మానలేదు. తల్లి మిగిల్చి పోయిన యాస్తి యావత్తు స్వాహా చేశాడు. ఇదివరకు కళకళలాడిన శరీరం ఈ నాడు క్రమక్రమంగా అంతమొందుతుంది. అతనికి భగవంతుడు యిచ్చిన 'ఆశలు, సుఖం, ఆనందం అనురాగాలు, వాంఛలు, ఆశయాలు అన్నీ విఫలమైపోయాయి.' ఏమిటీ ఈ బ్రతుకూ, ఎక్కడికి మన జీవితప్రయాణం? అక్కడికి పోవడానికి ఇంకెంత కాలం? జీవితానికి కాలపరిమితిలేదా? అయితే, ఎందుకులేదు? ఏక్షణాన అంతమై గాలిలో కలసి దొరకకుండా పోతుందో తెలియదా? ఇక చేయవలసినదేమిటి? నేను ఇంతకాలం ఏం సాధించాను? దీనికి అక్కడ ఏమి సమాధానం?' అని రవి రోజూ అనుకుంటూ తిరుగుతుంటాడు.



# మోసపోయిన బ్రతుకులు



రోజుమాదిరి కాలేజివిడువగానే అయిదుగంటలకు ఇంటికి చేరుకున్నాను కూని రాగాలు తీసుకుంటు, రూము తాళము తీసి పుస్తకములు ఒక మూలకు పడవేసి, డ్రెస్సు మార్చుకోకుండానే విశ్రాంతి కొరకు మంచము పై పవళించాను. నేను తదేక దృష్టితో ఆకాశము వంక చూశాను. సూర్యుడు అప్పుడే అస్తమించుటకు సమీపించుచుండెను. లేతపచ్చని కిరణములు కొబ్బరి చెట్టు ఆకుల నందునుంచి కిటికీగుండా లోపలికి వచ్చి గదిని ఇంకా కాంతివంతము చేస్తున్నవి. ధూళిదూసరితమంతయు ఆవెలుగులో స్వేచ్ఛగా విహరిస్తున్నాయి. అట్టి దివ్యమైన కాంతిలో మునుముందు జీవితములో జరగబోయె మధుర స్వప్నాలను ధ్వస్తంగా ఆలోచించుకుంటున్నాను. ఆ సమయమున రూము వరండాలో పోస్టుమెన్, అనే శబ్దము వినవచ్చింది. నేను ఆత్రతగా తలుపు తెరచితిని. ఒక బుక్కుపోస్టు పత్రిక నాకిచ్చి వెళ్లిపోయెను. ఈసారైనా పత్రికలో నాకథ ప్రచురణ కావచ్చని ఆత్రతగా దాని పైకవరు చించాను. విచిత్రం. దానిలోనుంచి ఒక కవరు నా కాళ్ళముందు పడింది. దానిని తీసి చూడగా

జి. పార్వతి
హవుజ్ నెంబరు 2-1-296
సుల్తాన్‌బజార్ హైద్రాబాద్ (పోస్టు)

ఇదంతా పోస్టు వాండ్ల పొరపాటనుకున్నాను. చూచుచుండగనే నిమిషములో నాలోవిచిత్రఊహలు బయలుదేరెను. మనస్సులోని ఊహాతరంగాలు అలలమాదిరిగా కొట్టుకుంటున్నాయి. అయితే, ఈమెకు ఉత్తరము ఎవరిదగ్గరి నుంచి వచ్చింది? ఆడవాళ్లకు ఉత్తరాలు రాసేటంతటి దగ్గరి సంబంధీకులు ఎవరువుంటారు? ప్రేయసీ ప్రియుల ప్రణయ సంబంధ రహ

స్యాలా? అన్నా చెల్లెండ్ల అనురాగ రహస్యాలా? బంధువుల బంధుత్వ రహస్యాలా? ఇన్నిటిలో ఏమైవుంటుందో? ఎట్లా తెలుసుకోవటం? స్త్రీల ఉత్తరాలు పురుషుల చేతులలో పడితే చూడాలని ఉబలాటంగా వుంటుంది. స్త్రీ అంటేనే పురుషునికి అనురాగం, ప్రేమ, వ్యామోహం, మరికొందరికి అసహ్యము కూడ వుంటుంది. స్త్రీ అంటేనే పురుషుని దృష్టిలో భగవంతుడిట్లా ఎందుకు కల్పించాడో అర్ధముకాదు. ఈ ఉత్తరము పురుషునిదైయుంటే, చదువకుండానే చించి పారవేస్తారు. నేనుకూడా ఏవిధంగానైనా ఉత్తరము చించాలని నిశ్చయించుకున్నాను. ఉత్తరములో ఏం రహస్యముందో నిజము తెలుసుకోవాలి. యదార్ధంగా చూడంది నిజము గ్రహించలేము. నిజము తెలుసుకోవాలంటే ఉత్తరము చించాలి....? కవరు చించాను.

'ప్రియమైన పార్వతి'

నీ ఉత్తరము అందినది. అన్ని సంగతులు తెలుసుకున్నాను. నేను అంతవరకు రాజాలకపోతున్నాను. కారణం....? మన రహస్యాలు రహస్యాలుగానే ఉంచాలి. నీవు విధవవు. నేటిసమాజములో మనవివాహమును ఎవరు సమ్మతించరు. తల్లిదండ్రులు సమ్మతించినా సమాజములో కులభ్రష్టులమైపోతాం. నల్గురిలో తలెత్తుక తిరుగుట యేదుర్లభం. సంఘానికి భయపడ నిన్ను కాదంటానని భయపడనవసరములేదు, అందువలన మన పెళ్లి రహస్యముగా జర్గిపోవాలి. ఇక్కడకాదు, అక్కడకాదు. ఎవరికి తెలియనిచావున మనలను ఎవరు గుర్తించని ప్రదేశమున, ఇద్దఱము కలసి పారిపోదాం ఈ సంగతి అతిరహస్యంగా వుంచాలి. ఈ రాత్రి బండికేరావాలి. నావద్దర డబ్బులేదు. నీ మొత్తము నగలతో మరియు చేతికందిన డబ్బుతో రావాలి. నీకోసరము కాచుకొని వుంటాను. ఈరోజు రానట్లైయితే మనమిద్దరము ఇక ఈ జన్మలో కలుసుకోలేము.

ఇక సెలవు

ఇట్లు,
నీ ప్రియుడు 'రమేశ్'

ఎవరబ్బా యితడు....? ఈ ఉత్తరము చూడబోతే చాలా విచిత్రంగా వుంది. ఇతడెవ్వడో సామాన్యుడుగా కనుపడుటములేదు. సంఘోద్ధారకుడుగా అగుపడుతున్నాడు. ఇదంతా వట్టి మోసమేమో....? ఎట్లానమ్మటం? డబ్బు కాశపడి ఈవిధంగా చేస్తున్నాడేమో? మోసమెందుకు కాకూడదు? అందరు మోసముచేస్తారు. చేయరెవరు? ఈ ఉత్తరము ఇవ్వనట్లయితే, ఆమెకు నేను మోసము చేసినవాడనవుతాను. అతడు మోసముచేసినా నేను కూడ కొంతవరకు బాధ్యుడనైపోతాను. ఇప్పుడు ఏమిచేయటం?

అందులో ఇది స్త్రీ పునర్వివాహము. సంఘం కాదంటుంది. నేనుకావాలంటాను. స్త్రీకి బాల్య వివాహం జరగటం, దురదృష్టవశాత్తు భర్త చనిపోవటం జీవితాంతము వరకు విధవగానే వుండిపోవటము జరుగుతుంది. నేటి సమాజములో.

స్త్రీకి పునర్వివాహము సమాజము శాస్త్ర సమ్మతము కాదంటుంది. కాని పురుషునికి రెండో పెండ్లయినా ఎందరు భార్యలైనా శాస్త్రసమ్మతము, న్యాయ సమ్మతమని అంగీకరిస్తుంది. చచ్చే ముసలివాడికైనా మరో పెండ్లిచేయటానికి ప్రయత్నిస్తుంది. కాని స్త్రీకి ఒప్పుకోదు, సమాజమునకు ఈ పక్షపాతమెందుకు? ఆ జన్మాంతమువరకు స్త్రీకి కఠినశిక్ష ఎందుకు? ఏది న్యాయం. సంఘమునకు? ఎక్కడుంది ధర్మం? ఇక సమాజము ఉద్ధరించవలసినదేది? స్త్రీలయందు అత్యాచారము అవిచ్ఛిన్నంగా కొనసాగించుటయేనా ఏటి....? ఈ సమాజములో దుర్దశకారణంగానే కొందరు స్త్రీలు వ్యభిచారములకు, దుర్మార్గములకు లోను కావలసి వచ్చింది. 'పురుషుల దుర్మార్గ చర్యలే స్త్రీల పతితావస్థలకు పునాదు' లని కొందరు మహానుభావులంటారు. సాంఘిక అత్యాచారలవలన సమాజిక నిబంధనలు సడలిపోతవి. మనస్సు విక్షిప్తమై, హృదయం ప్రతీకారం కోరుతుంది. పతితగా మారిపోతుంది. అది [illegible] అంటారు. స్త్రీకెందుకీ కట్టుబాట్లు? పురుషునికెందుకీ స్వేచ్ఛ? ఏమిటీ వింత మర్యాదలు? ఎన్నాళ్ళు ఈ విధంగా స్త్రీలను అత్యాచారములతో స్వార్థపరత్వముతో సమాజము బంధించుతుంది?

పురుషుని అవినీతి పనులకు సమాజము సమ్మతించుతుంది కాని స్త్రీలను ఒప్పుకోదు. కులభ్రష్టులుగా జేసి, కులటగా ప్రకటించుతుంది. అలా చేసింది ఎవరు? చేసేది ఎవరు? సంఘానికి నిమిత్తములేదు.

సంఘములో శాసనకర్తలకు విధవా వివాహముతో నిమిత్తములేదు.... ఆ సంఘ సంస్కర్తలే విధవలను పతితలనుచేయుటానికి చూస్తారు.

ఎంతమంది విధవలు అణగారని కోర్కెలతో, కన్నీరుతో దాహం తీర్చుకుంటూ కటిక చీకట్లో ఆరాటపడుతూ జీవచ్ఛవాలుగా బ్రతుకుతున్నారో? అని ఈవిధంగా నా మనస్సులో ఆలోచనలు పరుగులు తీసెను.

నేను ఆమెకు ఈ ఉత్తరము ఇవ్వకున్నట్లయితే జీవితము పాడుచేసిన వాడినవుతాను. ఉత్తరము ఎట్లయినా ఆమె కివ్వవలయునని తలంచితిని వెంటనే ఉత్తరము యివ్వటానికి గదినుంచి బయలుదేరాను.

అప్పుడు సుమారు ఆరున్నర కావస్తోంది. పొద్దున సరిగా భోజనము చేయలేదు. ఆకలి బాగావేస్తుంది. మొదలు ఆకలి తీర్చుకుందామనుకున్నాను. నాగదికి 'న్యూ తాజ్ మహల్' సమీపములోనే వుంది. ఫలహారము చేసి కాఫీ తాగి హోటల్ ఆవరణలోనికి వచ్చాను. ఆకాశంలో మేఘాలు దట్టముగా కమ్ముకొనుచుండెను. క్రమ్మక్రమముగా ఆ ప్రదేశమంతా గాఢాంధకారమై పోవుచుండెను. ఉరుములతో మెరుపులతో భయంకరముగా వర్షము వచ్చుచుండెను. ఆ వర్షావేగముతో వీధంతయు జలమయమైపోయెను. వర్షం వల్ల జనసంచారం తగ్గిపోయింది. వర్షం నీరు కాల్వకట్టి కలవరంచేస్తు పారుతుంది. క్రమ్మక్రమముగా వాన తగ్గిపోయింది. మరల అంతా యథాప్రకాశం నేను చిన్నగా హోటల్ నుంచి బయలుదేరితిని. వీధంతా విద్యుద్దీపాలతో ప్రకాశించుతుంది. చిన్నచిన్నగా తుప్పర చినుకులు పడుతున్నాయి. ఎన్ని కష్టాలైనా భరించి ఉత్తరమియ్యాలని నిశ్చయించుకొని మరి జోరుగానడుచుతున్నాను. కోటిదాటి సుల్తానుబజారు ప్రవేశించాను. రంగురంగుల విద్యుద్దీపాలతో సుల్తాన్‌బజారు దేవలోకములాగ ప్రకాశించుతుంది. చవరస్తాలోనికి వచ్చేవరకు అక్కడి పెద్దగడియారం టంగ్ టంగ్ మని ఏడుగంటలు కొడు

టుంది. జనం అటుఇటు పచార్లు చేస్తున్నది. విధిపముగానే తిప్పలుపడి ఆ ఇంటిని చేరుకున్నాను. పిలోషాప్ టాకీసుకు దగ్గర నందులోనే ఆ ఇల్లుంది. రోజు కాలేజికి ఇక్కడనుంచే పోతుంటాను. నేను ఇటుఅటు చూచాను. చుట్టుపక్కల యెవరులేరు. ఇంటిముందు పూతొట్ల విద్యుద్దీపము వెలుగు తూంది. ద్వారం బంధించిఫుంది. ఆమెకెట్లా ఈ ఉత్తరము అందియ్యటము నాకు ఎటు తోచలేదు. చాలాసేపు అటుఇటు పచార్లుచేశాను. సమయము సమీపించుతుంది. కాని ఎవరు బయటికి రాలేదు. ఇక ఆలస్యము చేస్తె లాభము లేదనుకున్నాను. ధైర్యముచేసి ద్వారము దగ్గర మీటర్ నొక్కాను. ఇంతలో నిశ్శబ్దాన్ని చీల్చుకుంటు ద్వారము తలుపులు తెరచుకున్నాయి. ఇరవై పింఛ్ల వయస్సుగల సౌందర్యవతి వచ్చి ద్వారము దగ్గర నిలబడినది.

నొసట కుంకుమ బొట్టు లేకున్నా అమృతము కురిపించే ఆమె కన్నులు, నల్లగ తీర్చి దిద్దిన ఆమె కనుబొమ్మలు, కళకళలాడె ఆమె నవ్వు ముఖము, తైలసంస్కారములేక పాలబుగ్గలమిద సుళ్ళు తిరుగుతున్న తల వెంట్రుకలు, పొంగి పొరలివచ్చే సౌందర్యము పల్చని జాకెట్టును పగల దీసుకొని వస్తున్నట్లున్నవి ఆమెవక్షోజాలు. ఆమెనుచూచుటతో నేనానర్వాంగము లుపరిపూర్ణములై వికసించెను. ఆమె సౌందర్యముచూసి నాకండ్లను నేనే నమ్మలేకపోయాను. నేను ఉత్తరము ఇవ్వగానే లేడిపిల్లవలె పరిగెత్తినది. నన్ను ఎవరినికూడ పలుకరించలేదు. రోజల్లా ఆ ఉత్తరముకొఱకే నిరీక్షించు చున్నట్లుగానేవుంది ఆమెముఖం. అందుకే వుండవచ్చు. యివ్వగానే ఆమె ఆనందముతో పరిగెత్తింది.

రోజల్లా నేను ఎన్నోసార్లు యిక్కడనుంచి పోతాను కాని నాకుఎన్నడు కానరాలేదే! తిర్గి నిశ్చింత హృదయముతో ఇంటికి చేరుకున్నాను.

• తెల్లవారింది. తొమ్మిదయింది. ఇంకా గంటటైమ్ వుంది. రాత్రిసంగతి తెలుసుకుందామని గది నుంచి బయలుదేరాను. దారిపొడుగునా ఆమె భవిష్యత్తును గురించే నాలో భావతరంగాలు దొంతర దొంతర్లుగా బయలు దేరినవి.

అక్కడ కొంతమంది యెవరిచుట్టో గుమిగూడారు. ఆసమూహమును చూడగానే నా మనస్సు తేలిక పడింది. కొంతమంది కన్నకడుపును ఓదార్చుతున్నారు. యథార్థము చెపుదామనిపించింది. కాని ఏమంటారోఅనుకున్నాను.

"ఏంకాలమొచ్చిందమ్మా పాడుకాలం'' అని కొంతమంది.

'ఈ నడుమంతరపు పిల్లలే ఇంత! ' అని మరికొంత మంది. కొందఱు తాము మహా గొప్ప వారమనుకొని గర్వపడుతున్నారు. కొందఱి పెదవులపైన చిరునవ్వు చిందులు తొక్కుతుంది. మరికొంతమంది సానుభూతిప్రకటించుచున్నారు. ఈవిధంగా అక్కడ కూడిన అమ్మలక్కలు తలకొక విధంగా అనుకొనుచున్నారు. నేను మాత్రము అక్కడ జరిగిందంతా అపరిచిత వ్యక్తిలాగానే చూచాను. ఇక లాభము లేదనుకొని కాలేజికి బయలుదేరాను.

కాలేజి మానివేసి ఉద్యోగములో ప్రవేశించాను. బి.ఏ.ప్యాసయినాను. అదృష్టమున హెడ్‌గుమస్తాపని దొరికింది.

ఈ మధ్యనే వరంగల్ నుంచి భువనగిరి ట్రాన్స్‌ఫర్ అయింది. సుమారు ఇక్కడికి వచ్చి అర్థసంవత్సరము కావస్తోంది. జీవితం ఏఆటంకము లేకుండా సాగిపోతోంది

ఆరోజు ఆదివారం చాలా పొద్దుపోయి లేచాను. గది తలుపు పెట్టివుంది. కిటికీమాత్రము తెరచివుంది. కిటికీ గుండా సూర్యుని స్వర్ణకిరణాలు వచ్చి గోడలను కాంతివంతము చేస్తోన్నవి. అప్పుడు తొమ్మిదయింది.ఇంతలో ఎవరోవచ్చి తలుపుతట్టారు. లేచి తలుపు తీశాను.

'గుడ్‌మార్నింగ్ మిస్టర్ రమేశ్!' అన్నాను కండ్లు తుడుచుకుంటు. ప్రప్రథమంగా యిక్కడికి వచ్చినప్పుడు అద్దెకు ఇల్లు చూపించి నాకెంతో సహాయము చేశాడు. అప్పటినుంచి మా ఇద్దఱికి బాగా స్నేహమేర్పడింది. సెలవు దినములలో నాగదికి వచ్చిపోతూ వుంటాడు. నల్లని ముంగురుల జుట్టు, విశాలమైన నేత్రాలు,సుమారు ముప్పది సంవత్సరాలుంటాయి.

రమేశ్ పరిచయముతోటి పార్వతి జ్ఞప్తికి వచ్చింది.

'మిస్టర్! రామారావు ఈ రోజు మా యింటికి భోజనానికి రావాలి' అన్నాడు.

నేను ఎందుకనోకూడ అడుగలేదు. పార్వతిని చూడాలనివుంది. అందు నుంచి ఏ ఆటంకము లేకుండా ఒప్పుకున్నాను. పార్వతిని లేవదీసుకొనివచ్చిన రమేశ్ యితడేనని నాకెందుకో అనుమానము కలిగింది. ఎన్నోసార్లు అడుగు దామనుకున్నాను. కాని సమయము చిక్కలేదు. ఎన్నో దినములనుంచికలలు కంటున్నాను. పార్వతిని నేటికి చూసేభాగ్యమైనా కలుగుతున్నందుకు, నామనస్సు ఎంతో ఆనందంగా ఉంది.

మిట్టమధ్యాహ్నము, ఎండ తీక్ష్ణంగా వుంది. మేఘాలు పరుగులు తీస్తు న్నవి. జీవితానికి గాలి మేడలు నిర్మించుకొంటు రమేశ్ ఇంటికిచేరుకున్నాను డ్రాయింగు రూములో నాకోసరమందరు నిరీక్షించుతున్నారు. చాలామంది స్నేహితులు కూడ వున్నారు. అక్కడ నేను కలలుగన్న పార్వతి మాత్రము లేదు.

'ఏం రామూరావు! యింత ఆలస్యమయిందేమి?' అన్నాడు రమేశ్.

"అవునోయి! ఇంటినుంచే ఆలస్యంగా బయలుదేరాను, అన్నాను.

రమేశ్ వరుసగా అక్కడందరి స్నేహితులతోటి పరిచయము చేశాడు

'మిస్టర్ రామూరావు! ఈమె నానతిమణి. పేరు కమల. కొన్ని నెలల క్రితమే వివాహము జర్గింది' అప్పుడే ఆ గదిలో అడుగుపెట్టిన కమలతోటి నన్ను పరిచయము చేశాడు. ఆమెను చూడగానె నా తల గిఱ్ఱున తిరిగి పోయింది. ఒళ్ళంతా చెమటలు పుట్టుకొచ్చాయి. గుండె ఆగిపోయేటంతటి పనయింది. ఏం మాట్లాడలేక నిశ్చేష్టుడనయ్యాను. ఈమె పార్వతి....కాదు? అని మనస్సులో అనుకొని అతిదీనంగా నవ్వుకుంటు నమస్కరించాను.

ఘోటనాలయిపోయినవి. ఇంటికి చేరుకునేవఱకు సాయంత్రం నాల్గు గంటలయింది. ఈ విషయంలో నేనెందుకో రమేశ్‌ను నమ్మలేకపోయాను. యథార్థము ఎట్లయినా తెలుసుకోవాలి. పార్వతి ఏమైంది? ఎక్కడుంది?ఎవరి తోటి తెలుసుకోవాలి? ఎట్లా తెలుసుకోవాలి?

అది సాయంత్రం సుమారు ఏడు గంటలు కావస్తోంది. నేనొక పచ్చిక గడ్డిదిబ్బపై కూర్చున్నాను.ఆకాశంలో చంద్రుడు స్వేచ్ఛగా ప్రకాశించు

టున్నాడు. హృదయానికి హాయినిచ్చే చల్లని పిల్లగాడ్పులు బాగా వీస్తున్నాయి. మనస్సును మత్తెక్కించే మధురమైన మల్లెలసువాసనలువీస్తున్నాయి.అంతలో ఎవరో వస్తున్నట్లు అలికిడి అయింది. చప్పున వెనుకకు తిరిగిచూశాను.

'హల్లో శేఖర్!' అన్నాను. శేఖరు మా ఆఫీసులో క్లర్కుగా పనిచేస్తున్నాడు. చాలా తెలివయిన యువకుడు. అతను నాముందుకొచ్చి కూర్చున్నాడు.అతని ముఖం ప్రశాంతముగా వుంది.

'చూడు, శేఖర్ రమేశ్‌ను నీ వెఱుగుదువా?' అన్నాను.

'ఏ రమేశ్....?' అన్నాడు.

'ఆరోజు కాఫీ హోటల్‌లో మనతో కూర్చొని కాఫీత్రాగలేదా!' అన్నాను.

'అతడా....?' అని ఎందుకో ముఖమంతా చిట్లించుకున్నాడు.

'ఎందుకురా అలా అంటావు?' అన్నాను.

'ఒక విధవ జీవితాన్ని నాశనము చేసిన వంచకుడు. అభమూ శుభమూ తెలియని ఒక విధవ జీవితాన్ని మంటకలపిన మహానుబావుడు. చుక్కానిలేని ఆమె జీవిత నౌకను అగాధసాగర తరంగాలలో వదిలేశాడు. ఎన్నో ఆశలు చూపి లేవదీసుకొచ్చి ఆమెదగ్గఱున్న డబ్బును స్వాహా చేసి వెళ్లగొట్టాడు. పదివేల కట్నానికి ఆశపడి తిరిగి పెండ్లి చేసుకున్నాడు. చేసిన పాపానికి అనుభవించకపోడు' అని ఎంతోకోపంగా అన్నాడు.

'అయితే, ఆమెను నీవెఱుగుదువా?' అన్నాను.

'ఎందుకెఱుగనురా!' అని కన్నీరు కార్చుతున్నాడు

'ఎందుకురా ఆ కన్నీరు కార్చేది?' అన్నాను.

'అది ఒక చిత్రగాథ! విను....' అన్నాడు.

ఒకనాటి సాయంత్రం కాలక్షేపానికి యిక్కడే పచ్చిక దిబ్బపైన కూర్చున్నాను. అది వేసవికాలము సూర్యుడు అప్పుడే అస్తమించుతున్నాడు మసక చీకట్లు నలుదిక్కుల కమ్ముకున్నవి. ఇంతలో ఏదోచప్పుడయింది. అటునిటు కలియచూశాను. దూరమునుంచి ఎవరో చెఱువు గట్టుపైకి పోతున్నారు. ఆ చీకట్లో ఎవరైంది సరిగా గుర్తించలేము. ఇంతరాత్రి చెఱువు గట్టుపైన ఎవరికేమిపని? నాకు అనుమానము కలిగింది. అటునిటు కలియ చూసు

కుంటూ మాటి పోతున్నారు. ఏవిధంగానైనా రక్షించాలనుకున్నాను. నేను కూడ చిన్నగా వెంబడించాను. ఇప్పుడెవరో స్పష్టంగా కనిపిస్తుంది. ఓ స్త్రీ చిన్నగా చెరువు గట్టుకు చేరుకుంది. నాకేమి బోధపడటములేదు. నేను అక్కడికి చేరుకోకముందే ఆమె చెరువులో దుమికిపోయింది. ఇక ఆలోచించే సమయములేదనుకొని నేను చటాలున ఆ చెరువున దుమికితిని. వెదుకొనుచు పోయి నలుదిక్కుల మునిగి యామెను రక్షించి ఒడ్డుకు చేర్చాను. ఇంకను ఆమెకు స్మృతి తప్పిపోలేదు కానిఆమెచాలా సేపటికిగాని స్వస్థురాలు కాలేదు. పూర్తిగా స్వస్థత చేకూరిన తర్వాత 'పిచ్చిదానా! నీవు చచ్చి ఏమి సాధిస్తావు? అనవసరమైన విషయాలకు అలజడిచెంది జీవితమును ముంచుకలువుతావా? సుఖదుఃఖాలు రెండు సర్వేశ్వరునిసృష్టి. ఈలోకములో అందరికి ఆనందం ఎక్కడ రాసిపెట్టివుంది అనుభవించటానికి! కష్టాలకి భయపడి పారిపోతావా....? అందరికీ ఎల్లకాలము ఒకేరీతిగా ఉండదు మంచి రోజులు రాకపోవు అంత ఆపద ఏమైవుంటుంది ఆత్మహత్య చేసుకోవాటానికి...?' అని అన్నాను.

ఆమె ఏమి సమాధానమియ్యలేకపోయింది. ఆమె ముఖములోని విషాద ఛాయలు కొద్దిగా తొలగిపోయినవి. కండ్లనుండి మాత్రము కన్నీటి చుక్కలు టపటపమని పడుతున్నవి.

ఆరాత్రి ఆమెను వెంటబెట్టుకొని ఇంటికి బయలుదేరాను. ఆమె జీవితములో జరిగిన సంగతంతా చెప్పింది. నేను వుండే ఇంటిలో రెండుగదులు మాత్రమే వున్నాయి. ఒక గదిని ఆమెకు చూపించి నేను పోయి నాగదిలో పండుకున్నాను.

తెల్లవారింది. సుమారు ఏడు గంటలు కావస్తోంది. ఆమెగదికెళ్లాను. ఆమె ప్రక్కమీదలేదు. ఆమె ఎటుపోయిందో ఏమో....?

శేఖర్ చెప్పిన ప్రతి అక్షరము నా గుండెలో బాకులా గుచ్చుకుంటుంది. శరీరమంత స్తంభించిపోయింది. కళ్ళునిండా నీళ్ళుతిరుగుతున్నాయి. పెదవులు వణుకుతున్నాయి. జలజల కన్నీటి భాష్పాలు రాలిపోతున్నాయి.

నాకేం మయిందని నాకింతగా బాధపడేవాడిని గాను. నా చేతులార పార్వతి జీవితమును పాడు చేశాను.

శేఖర్ నవ్వుతూ 'ఏమిరా? అలా ఉన్నావు?' అని 'ఏమైనా ఆ తప్పు చేశావా?' అని శేఖర్ తిరిగి ప్రశ్నించాడు.

'శేఖర్! నిజంగా చెప్పాలంటే దీనంతటికి కారణకర్తని నేనే!' అని జరిగిన సంగతంతా చెప్పాను.

'నేను అది తప్పని ఎప్పటికి నమ్మను. తప్పులు అందరు చేస్తారు. ఆ తర్వాత పశ్చాత్తాపపడతారు. మానవుడు నిద్రనుంచి మేల్కొనటానికి జీవితములో తప్పులు అవసరమే!' అన్నాడు శేఖర్.

చాలా రాత్రయింది. మిత్రుని సాగనంపి యింటికి చేరుకున్నాను. ఇంటిలోని గడియారము పన్నెండు గంటలు కొట్టింది. శేఖర్ అన్నమాటలు నామనస్సులో పదేపదే జ్ఞప్తికి వస్తున్నవి. దీనికి ప్రాయశ్చిత్తమేమి? అదే ఒక్కటే మార్గం పార్వతి జీవితాన్ని ఉద్ధరించుటమే!......పార్వతిని పెండ్లి చేసుకోవటం, ఆమె ఒప్పుకుంటుందా? ఎందుకొప్పుకోదు. ఆమె జీవితం మధుర స్వప్నంలాగా చేయదల్చుకుంటే! అయితే, పార్వతి ఎక్కడుంది?

తెల్లవారింది. మామూలు వేళకు ఒక గంట ముందుగానే ఆఫీసుకు పోయాను. ఆఫీసులో అప్పటికింకెవ్వరూ రాలేదు. కాసేపు పోయాక శేఖర్ మాత్రం వచ్చాడు.

'మిస్టర్ రామారావు! పార్వతి ఉత్తరము రాసింది. ఇదిగో చూడు' అని నాచేతికిచ్చాడు.

ఆ ఉత్తరము చూడగానే నాకెంతేని ఆనందం కలిగింది.

'ప్రియమైన శేఖర్ అన్నగారికి,

నేను క్షేమంగానే ఉన్నాను. కాలం బాగా గడచిపోతుంది. నేను మీ ఆదరణకి ఎంతో ధన్యురాలిని. నా జీవితము నిష్కళంకముగా సాగిపోతుంది. నేను ఆనాడు మీకు చెప్పకుండా పోయాను. క్షమించాలి.

ఇట్లు
పార్వతి
మౌంట్ రోడ్డు-మద్రాసు.

అర్ధరాత్రి కావచ్చింది. నిద్ర సరిగా రావటములేదు. ఇంతలో ఇంటి తలుపులు తీసిన చప్పుడయింది. నాకప్పుడే కునుకుపడుతుంది.

'ఎవరు నాయనా! చలికి ఇక్కడ పడుకున్నావు పాపం! చలికి బాగా బాధపడుతున్నట్లున్నావు. ఇలా ఇల్లోకొచ్చి పండుకో' అంది ఆమె ఎవరో వచ్చి జాలిగా. నేను చిన్నగా ఆమెను వెంబడించాను.

'నీకిక్కడ ఎవరులేరా?' అని మరల ప్రశ్నించింది.

'లేరు' అని వణుకుతు సమాధానమిచ్చాను.

'లేకుంటె ఈ పాడు పట్నానికి ఎందుకొచ్చావు నాయనా!' అంది ఎంతో జాలిగా. ఇంట్లో దీపం గుడ్డిగా వెలుగుతుంది. దానిని పెద్దగచేసి నావద్దకు వచ్చింది. ఆమెకు సుమారు అరువై సంవత్సరాలుంటాయి.

'ఇలా ఈరూములో పండుకో నాయనా!' అని నాకోగది చూపించింది.

తెల్లవారింది. ఇంతలో నేను పడుకున్న గదితలుపులు తెరచుకున్నాయి. ఆమె ఎవరో చిన్నగా నారూముకొస్తుంది. చేతిలో చీపిరి వుంది. ఇంటిపని మనిషి కాబోలు గదిని శుభ్రము చేయటానికి వస్తుంది. ఆమె చాలా దగ్గరకు వచ్చింది సూర్యుని కిరణాలు కిటికీ గుండా రూములో పడుతున్నాయి. ఆమెను నేను గుర్తుపట్టాను. పార్వతి....అవును పార్వతియే! నిజంగా నా ప్రేమసుందరియే! ఇదివరకు కాంతితో తళతళలాడిన ఆమె నయనాలు లోపలికి పీక్కుపోయి నిర్జీవంగా వున్నాయి. మనిషి చిక్కిపోయింది ఆమెను చూడగనే నా మనస్సులోని భావాలు అనందంతో కట్టలు త్రెంచుకొని అంతరాళాలలో ప్రవహించుచున్నవి.

"గదిని శుభ్రము చేయాలి శ్రమ అనుకోకుండా మీరు కొద్దిగా బయటకు వస్తారా?' ఆమె ముందుగా అంది.

'ఏవూరు నాయన మీది?' అని తిరిగి ప్రశ్నించింది.

'మిమ్ముల ఎక్కడో చూసినట్లుంది? కాని, జ్ఞాపకము రావటములేదు' అంది మరల.

నన్ను కొంతవరకైనా గుర్తుపట్టినందుకు నా మనస్సు ఎంతో తేలిక పడింది. ఆమె కంఠస్వరం సమాధానము కొరకు ఎదిరి చూస్తున్నది.

'అనాడు..........ఉత్తరం...?' అని అసలు సంగతిచెప్పాను

'క్షమించండి! మీరు పొరపడుతున్నారు. నేను మోసపోయి నాజీవితం ముసురుకపడంలో ఒకరెక్కి అర్పించింది మీకు తెలుసు. తెలిసుండికూడ నాకోసం మీరు యింతగా తాపత్రయపడుతున్నారంటే అర్థముకాదు, ఆమె కోపం అభినయిస్తు అంది.

"అది కాదు పార్వతి! అనాడు పొరపాటున ఉత్తరమిచ్చి, నీకు తీరని మోసము చేశాను. అప్పటి పరిస్థితిలో అలా చేసింది విలులేక పోయింది. ఇప్పుడు నేను చాలా విచారించుతున్నాను. నిరంతరం నిరాశా నిస్పృహలు సిలోలేకుండ నీ జీవితం మధుర స్వప్నంలా చేయదల్చు కున్నాను' అన్నాడు.

'నీ చదువు సంస్కారము యిదేనా? నన్ను మీరుఅపార్థం చేసుకుంటు న్నారు. అయన నన్ను మోసముచేశారు. కాని నేనాయనకు మోసము తల పెట్టలేను. నేనింకా అయనసెంతగానో ప్రేమిస్తున్నాను. ఇందులో నీదేకాదులే నా తప్పుకూడ యున్నది. అనాడుఏది ఎలా వస్తుందో గ్రహించుకోలేకపోయాను అంది.

'తప్పు పార్వతి! నీవలా బాధపడకూడదు.........నీ బ్రతుకంతా వృధా అవుతుంది. వెనుకటికాలంలో అలా జరిగింది. కాని, ఇప్పుడలా జర్గటానికి వీలులేదు. నీ జీవితం దుర్భరమౌతుంది. సంఘం కనీసం సానుభూతియినా చూపదు. నీ మనస్సును పాడుచేస్తుంది. నీవు జీవితంలో అనుభవించాల్సిన మాధుర్యమంతా ముందే ఉంది'.అన్నాను.

'క్షమించండి! అనంగతే నాముందు మీరు యింకొకసారి ఎత్తపద్దు. సమాజము నన్ను కులటగా చూస్తుందని మీ అభిప్రాయం కాబోలు. అవును! నిజం! నేటి సమాజములో స్త్రీ బ్రతుకుటయే దుర్లభం. ఇక నామనస్సును మీరంతగా బాధించకండి. 'వాడిపోయిన పుష్పానికి తిరిగి పరిమళమొందుటు

నేనిలా...బ్రతికుండటము ఏ ఆశ్చర్యంగా ఉందికదూ.......! అలా ఎప్పటికి భావించుకోకు అన్నయ్యా!' అంది.

తలెత్తి ఆమెను చూశాను. వెచ్చని కన్నీటి బొట్లు చెంపలమీదుగా జారి క్రిందపడుతున్నాయి. ఇక నేనేమి మాట్లాడలేకపోయాను. నా ఆశలన్నీ అడుగంటిపోయినవి. కొంతవంత ఆశతోవచ్చి తిరిగి నిరాశతో పోవలసివచ్చింది. నేను మోసపోయాను....?

అదిసాయంకాలం. సముద్రపొడ్డున తెల్లని యిసుక తిన్నెమీద కూర్చున్నాను. పిలి నిర్మానుష్యముగా వుంది సముద్రములోని కెరటాలు అతివేగంగా వెదజల్లుతు వచ్చిన తెల్లని నురుగులూ పచ్చని పాషాణాలకు కొట్టుకొని తిర్గి నిరాశతో గత్యంతరంలేక విచ్ఛిన్నమైపోతున్నాయి. ఆ సముద్రపు కెరటాలుపడే ఆవేదన ఆందోళనను చూస్తున్నాను. మానవుని జీవితముకూడ ఇంతేగా! అతివేదనతో ఏవో ఎదిరిస్తాడు. ఎంతో ఆరాటపడుతాడు. మధుర క్షణంకోసం నిరీక్షిస్తాడు. కొన్నాళ్లు తనివితీరా అనుభవించి తిరిగి నిరాశతోనే పోతాడు. ఈవిధంగా ఆలోచించుకుంటు శూన్యంలోకిచూస్తున్నాను ఏదోశబ్దం విని వెను తిరిగిచూశాను. నాముందు కొన్ని గజాల దూరములో ఒకశవం పడివుంది. సముద్రపుటలలు అంతవఱకు తీసుకొనివచ్చి ఇకమాచేత కాదనుకుంటు తిర్గి వెళ్లిపోతున్నాయి. ఆ శవమును చూచేవఱకు నేను నిలువున నీరైపోయాను.

'ఎంతపని చేశావ్....? రమేశ్ !!' అని మాత్రం అన్నాను. అతని ప్రక్కనే తడిసిన ఉత్తరముంది దానిని తీసి చూడగా....?

'నేను జీవితములో మోసముచేశాను. మోసపోయాను. దానికి తగ్గ ప్రతిఫలం అనుభవించాను. డబ్బుకాశపడి ఒక విధవ జీవితమును పాడు చేశాను. తిరిగి పదివేల కట్నానికి ఆశపడి పార్వతిని విడిచి మరలవివాహము చేసుకున్నాను. ఆమె నన్ను మోసముచేసి ఒకరితో లేచిపోయింది. చేసిన మోసానికి క్షమాపణ కొఱకు మద్రాసు వచ్చాను. నాకు పార్వతి ఎక్కడ కనిపించలేదు. తిరిగి నిరాశతో పోయేకంటె....ఆత్మహత్య చేసుకున్నాను.

ఇట్లు
రమేశ్

ఏకధారగా కన్నీరు ప్రవహించుతుంది. ఎదుటి దృశ్యాన్ని చూడలేకపోయాను. ఇంతలో ఎవరో వచ్చి నా వీపు తట్టారు. వెను దిరిగి చూచేటికు శేఖర్, పార్వతి వున్నారు.

'ఏమిటి యిదంతా?' అని శేఖర్ ప్రశ్నించాడు.

నేను ఏమీ మాట్లాడలేకపోయాను. ఉత్తరము చూపించాను. పార్వతి 'రమేశ్....' అనుకుంటూ భౌతిక దేహంపైబడి ఘోరున యేడుస్తుంది. నేను శేఖర్ కంట నీరుపెడుతూ మౌనంగా నిలుచుండిపోయ్యాం.

(అధారంగా)



